శ్రీరస్తు.

# శివతత్త్వసారము.

కందపద్యములు.

ఉపోద్ఘాతము.*

శ్రీపతివాక్పతిముఖ్య[1]మ, హాపురుషులు [2]నెఱుఁగ నోప రతివాఙ్మనస
వ్యాపార మైననీనిజ, రూపము నే నెట్టి దని [3]నిరూపింతు శివా. ౧
[4]ఒందంగ శివునితత్త్వం, [5]బందఁగ విజ్ఞాన మేక మజ మక్షరమా
నందం బనియెడుఁగాని య, నిందితముగ నిట్టి దనఁగ నేరవు [6]శ్రుతులున్.
ఇది గా దిది గా దనియెడి, మొదలఁ బృథివ్యాదు లయినమూర్తుల నెల్లం
జదువుచు శివు ని న్నె(ఱు)ఁగక, వెదకుచునున్నవి సమస్త [7]వేదాంతములున్.
వా దేమి యనంతా నై, వేదా యను వేదములును [8]వివిధ విధములన్
వాదిడి వెదకెడి నన్నమ, హా [9]దేవా ని న్నెఱుంగ [10]నస్వలతలమే. ౪
నీమూర్త్యాత్ముల నీ వని, ప్రేమముతోఁ గొలుతు రెంత పెద్దలు నీత
త్త్వామేయరూప మె(ఱు)ఁగుట, సామాన్యము [11]గామిఁ జేసి సర్వానందా.
హరిసరసిజభవు లాదిగఁ, బరమమునీంద్రులకు నె(ఱు)ఁగ భర మగునీదు
ర్భరభూరిమహిమ వొగడఁగ, నరు లెంతటివా రనాథనాథ మహేశా. ౬
స్తుతి నిజగుణకథనమునకు, నతిశయగుణకథన [12]మందు రన్నిజగుణసం
గతి ము న్నె(ఱు)ఁగక శివ భవ, దతిశయగుణకీర్తి సేయ నలవియె రుద్రా. ౭
స్తుతియును నిందయు లోక, త్రితయంబున నీకు [13]లేమి తెల్లం బగుటన్
మతిఁ దమకుఁ గృతార్థత్వ, ప్రతిపత్తికి మిమ్ము జనులు [14]ప్రణుతింతు రజా.
ఓడక నినుఁ బొగడఁగ నా, యీడగుఁ గాదని తలంప కే [15]వేదు లనై
చూడవె పొగడెద[16] ననియెద, వేడుక కారణముగాఁగ వె[ఱ]వక రుద్రా.

---

* ఉపోద్ఘాతము మొదలయినశీర్షికలు (headings) మూలమందు లేవు. విషయబోధ సులభముగ నగుటకై మాచే నేర్పఱుపఁబడినవి.

1. ము. 2. నెఱఁగ. 3. నిరూపంబు. 4. ఒందంగ్గ శివునితత్వం. అంతటను 'తత్వ' శబ్దమిట్లే ద్విత్వశూన్యముగానున్నది. 5. బంద్దంగ. 6. శ్రుతులునూ. 7. వేదాన్తములూ. 8. యువిధవిగములన్. 9. దేవాయనిన్నెరుంగక. 10. నస్వలంపలమే. 11. గాంగంజేసి. 12. మంద్రుఅన్నిజ. 13. లేమిందెల్లం. 14. ప్రణుతింతు. 15. వేదురనై. 16. ననియెదు.

నే నొకనికృష్టమనుజుఁడ, మానసవచనాతిదూర [1]మహనీయమహా
త్త్వానంద నిన్నుఁ బొగడఁగ, నే నెంతటివాఁడ సురమునీంద్ర వరేణ్యా.
పన్నగ లజ్జింపక శివ, ని న్నేఁ బొగడెద ననంగ నేర్తునె దేవా
విన్నపము వినుము సకలజ, గన్నాథ యనాథనాథ కరుణాంబునిధీ. ౧౧
దురితహర మనియు శుభములు, దొరకొను ననియును దలంచి దురితారి భవ
చ్చరణాబ్జభక్తిలలనా, పరవశభావమున నిన్నుఁ బ్రణుతింతు శివా. ౧౨
గతదేహేంద్రియ [2]నిత్య, స్వతంత్ర సర్వజ్ఞ విమల సర్వగతైకా
ప్రతిమసదానందాత్మక, మతిసూక్ష్మము నీస్వరూప మతిలోక శివా. ౧౩
సర్వేశ్వర షట్త్రింశ, త్పర్వోపరిగతజగత్ప్రభవహేతుజగ
న్నిర్వాణసోమరూప మ, ఖర్వమహత్త్వంబుఁ బొగడఁ గడు నరిది శివా.
సరసిజభవసరసిరుహా, దరులకు నటమీఁదిమూఁడు దా [3]నధికము ము
వ్వురు నియమకారు లవ్వా, రరిదిజగత్కర్త లాఘ్యు లతి [4]మహిము లజా.
శ్రీమత్సదాశివేశ్వర, నామ భవద్ధామముల మనంబునఁ దలఁపం
గా మ(ఱి) నాక్కునఁ [5]బొగడం, గా మా కలవియె సమస్తకామాతీతా.
సర్వేశ్వర కావున భవ, దర్వాచీనస్వరూపుఁ డనఁదగు[శ్రీ]మ
త్పర్వతపుత్త్రీపతి మ, ద్గీర్విభవము శక్తి[కొలఁది] గీర్తింతు శివా. ౧౭
జయ మగు వేదంబులకును, జయ మగుఁ బంచాక్షరికిని జయమగు నిటలా
క్షయ మగుభసితంబునకును, జయమగు మాహేశ్వరులకు సంతతము శివా.
జయ మగు శివమార్గమునకు, జయ మగు శివసంహితలకు జయమగుఁ గ్రీడా
మయు లగుప్రమథగణములకు, జయమగు వేదాదిధర్మచరితులకు శివా. ౧౯
శివ మగు ధార్మికనృపులకు, శివ మగు గోబ్రాహ్మణులకు శివమగు మఱియుఁ
శివనిందావిరహితు లగు, భువనత్రయజనుల కెల్లఁ బుణ్యంబు హరా. ౨౦


పశుపాశపతిజ్ఞానము

జ్ఞానము పశుపాశపతి, జ్ఞానమ [6]యని యెల్ల(ఱు)ంగఁ జాలనిజడు ల
జ్ఞానులు వారల తత్త్వ, జ్ఞానము లజ్ఞానములు విచారింప శివా. ౨౧
పతి రుద్రుఁడు పశువుల కని, శ్రుతి చెప్పుచునునికిఁ జేసి రుద్రుఁడు పతి త
క్కితరులు పశువులు పొమ్మని, మతిలో నె(ఱి)ఁగితి శ్రుతిప్రమాణమున శివా.

1. మహనియ్యమహత్వా. 2. నిత్యా. 3. నధికములు. 4. మహము. 5. బొగడగ మాకలవియె. 6. యుని.

పూని యతద్గుణసంవి, జ్ఞానబహూబ్రీహి మాస్పఁ జనుచెంచిన [1]యణో
మానితషష్ఠీతత్పురు, షానూనసమాస మెఱుఁగ రజ్ఞులు రుద్రా. ౨౩

జీవు లనేకులు పశువులు, భావింపఁగఁ బ్రకృతివికృతిబంధము పాశం
[2]బావృతము లనం బశువులు, నీ వారెంటికిని బతివి [3]నియమము మహిమా.

పశుపతియు పాశములఁ దన, పశువులకును బంధమోక్షపద్ధతి సేయం
గుశలుఁడు గా కవి యొరులకు, [4]వశవర్తులె నేర్పుగలదె వారికి రుద్రా.

పశువులఁట జీవరాసులు, పశుపాశంబులకు నీ[వ]పతివఁట శివ నీ
వ శరణ్య మనం బశుడు, ర్వశభవపాశములు తెగకవచ్చునె యుండఁగన్. ౨౬.

బ్రహ్మోక్తసమస్తహరి, బ్రహ్మాదిపిపీలికాంతపశువుల కెల్లన్
బ్రహ్మోపేంద్ర[య]శోహర, బ్రహ్మేశ్వర రుద్ర నీవ [5]పతి పలిలోకా. ౨౭

వేదోక్తమార్గమున న, త్యాదరము[న] నిన్నుఁ గొలిచి యప్పశువులు నీ
చే [6]దేహపాశబంధ, చ్ఛేదంబున ముక్తు లగుట సిద్ధము రుద్రా. ౨౮

గోపతికృతమున భవపా, శాపేతము లైనపశువులట్లు భవ[త్]పా
శాపేతు లైనపశువులు, ప్రాపింతురు మోక్షసుఖము పశుపతి నీచేన్. ౨౯

త్రిమలకృతదుఃఖసంసా, రమహాబ్ధినిమగ్నజీవరాసులు నీ[7]యు
త్తమకారుణ్యపశంబున, విముక్తులై నీవెపోలె వెలుఁగుదురు శివా. 30

—— అద్వైతమత ఖండనము ——

జ్ఞానజ్ఞేయజ్ఞాతృని, దానత్రయమున [8]నబాధితప్రత్యయ మై
నానాగతి ననగత మగుఁ, గాన జగద్భేద మెన్నఁగా సిద్ధ మజా. 3౧

భేదము దృష్టాదృష్టని, పాదక మై వైదికోక్తపథదర్శనసం
పాదనసమర్థ మగుటను, భేద మదర్శనము ప్రకటితపిండితము శివా. 3౨

భేదము సిద్ధంబగుడు వి, భేదకసిద్ధి [9]యగుఁ దద్విభేదకసిద్ధిన్
వేదోక్తకర్మదశలం, దాదర మగుఁ దత్ఫలప్రదారాధ్యగతిన్. 33

ఆరాధ్యుఁ డైనయీశ్వరు, [10]నారాధించుటయు స్వర్గ మపవర్గము ధా
త్రీరాజ్యాదిసుఖంబులు, భోరునఁ గర్మానురూపముల జనుల కగున్. 3౪

---

1. యన్. 2. బావృతునంబశవుతు. 3. నియమమహిమా. 4. పశువర్తుల. 5. పశుపతిలోకా. 6. దేహపాశబంధచ్ఛేదంభవముముక్తులగుట. 7. వుత్తెను. 8. సబాధిత. 9. యగుడు. 10. నారాధించుటయును.

ప్రత్యక్షజగద్భేదము, సత్యంబై తోఁచుచుండు శబ్దంబునఁ ద
త్ప్రత్యక్షబాధ యగు నని, యత్యనుచితవృత్తి నడుతు రద్వైతు లజా. ౩౫
అమరంగఁ బ్రపంచ[1]మిథ్యా, త్వను చెప్పెడువాది నున్న దానికి సద్భా
వము దా నెఱుఁగక [2]మిథ్యా, త్వ మనాశ్రయమెట్లు జెప్పఁదలపోయుశివా.
మానముచేత గృహీతము, గాని [3]ప్రపంచ మ్మె(ఱు)ంగఁ గడుదుర్ఘట మా
[4]మానగృహీతము తథ్యము, తా నెన్నఁడు మిథ్యగాదు తలపోయ శివా.
[5]ఉత్తరశుక్తిజ్ఞానని, వృత్తం బగుశుక్తిరజతవేదనముక్రియఁ
వృత్తజగద్భేదము చెడు, న త్తఱి నద్వైతు లెన్న రంధ్ర మహేశా. ౩౮
నిర్వచనీయము లేక య, నిర్వచనీయంబు గలదె నిర్వచనీయా
నిర్వచనీయోత్పత్తిన, సర్వాద్వైతంబు చెడదె సర్వానందా. ౩౯
జీవుఁడు శివుఁ డనువాక్యము, భావింపఁగ నైక్యమునకుఁ బ్రతిపాదకమే
జీవుఁడు నీపశుభృత్యుఁడు, గావున నీవాఁడ వేఱు గాదనుట శివా. ౪౦
జీవునకు బంధమోక్షద, శావస్థలు గలవు నీకు నవి లేవగుటన్
జీవునకు నీకు నైక్యము, భావించుట ముఖ్యవృత్తి [6]బాధకము శివా. ౪౧
పరమేశ్వర నీకును మ(ఱి), పరమక్లేశాత్ము లైనపశుజీవుల కం
తరము మహాధాత్రీధర, పరమాణుల[య]ంతరంబు భావింప శివా. ౪౨
ఆత్మ నిరాకారుం డని, యాత్మన మ(ఱి) వెండి జగదుపాదానముగా
నాత్మీయబుద్ధిఁ జెప్పెడి, [7]యాత్మాద్వైతులు విమోహితాత్ములు రుద్రా.
మాతయు మానము మేయము, భాతిగ మిథ్యయని పల్కు [8]పాతకు లాత్మా
ద్వైతులు ప్రమాణశూన్యులు, నీతి యె(ఱు)ంగుదురె తత్త్వనిర్ణయము శివా.
తనకంటె వే(ఱె) యీశ్వరుఁ, డన లేఁడని పలుకునట్టియద్వైతవిమూ
ఢునకు[ను] లోకాయతునకు, వినఁగా భేదమ్ము గలదె విష్ణువరేణ్యా. ౪౫
ఏన పరమేశ్వరుఁడ న, జ్ఞానంబున నిన్ను నెఱుఁగఁజాలన యనువి
జ్ఞానవిహీనాత్ముల[చెడు], పానలు వోవిడిచి నిన్నె [9]భజియింతు శివా. ౪౬
జ్ఞానస్వరూపుఁ డీశ్వరుఁ, డేని వితర్కింప నట్టియీశ్వరునకు న
జ్ఞానము దొరకొన దని తా, ర్కాణం [బది] యేల సేయ రద్వైతు లజా.
తా రద్వైతులు సచ్చి, త్కారణసర్వజ్ఞసర్వగతనిత్యనిరా
కారుఁ డని చెప్పి వెండి య, కారణమ యవిద్య నీకుఁ గల్పింతు రజా.

---

1. మిథ్యాత్వము. 2. మిథ్యాత్వ. 3. ప్రపంచమెఱుంగగడుదుర్ఘటమగు. 4. మానహిత
ముతము. 5. ఉత్తమ. 6. పాతకము. 7. నాత్మాద్వైతమతులు. 8. పాచకులు. 9. భజింతు.

కల దననోపక లేదని, పలుకఁగనేరకయు మూకబధిరులక్రియ ని
మ్ముల నద్వైతులు తమలో, పల [1]వగతురు భువనభిన్నభావమున శివా.
ఆరాధ్యుం డారాధకుఁ, డారాధక మనఁగ లేనియద్వైతదురా
చారకృతసర్వశూన్యా, కారస్థితి నేమి సేయఁగావచ్చు శివా. ౫౦
పాతకము సకలనాస్తిక, జాతనివాసంబు సర్వసంకర మాత్మా
ద్వైతం బనఁగా జగదు, త్పాతము దొరకొనును నె యిట్లు [2]పరమానందా.
నిత్యమహాజనదూష్యము, ప్రత్యక్షాదిప్రమాణబాధాబాహ్యం
బత్యనుచిత మద్వైతము, కృత్యాకృత్యాదిశూన్యకీటకమౌ శివా. ౫౨
[3]అద్వైతమ్ము పురాతన, విద్వన్మునివరుల కెల్ల విద్విష్టము సా
క్షాద్వేదోక్తము గామిని, [4]సద్విద్యాద్వైతులకు నసహ్యంబు శివా. ౫౩
ప్రాజ్ఞులు వేదజ్ఞులు లో, కజ్ఞులు చేకొంద్రె [5]గతశిఖాగాయత్రీ
యజ్ఞోపవీతనాస్తికు, లజ్ఞులు చేకొంద్రుగాక [6]యద్వైత మజా. ౫౪
స్వేచ్ఛాచారులు మిథ్యా, విచ్ఛేదన వేదశాస్త్రవిప్లవవాదుల్
ప్రచ్ఛన్నదోషు లజ్ఞా, నాచ్ఛాదితదుష్టచిత్తు లద్వైతు లజా. ౫౫
కమలాక్షకమలగర్భ, ప్రముఖాఖిలసురులు మునులుఁ బాశుపతులు భ
స్మమయాంగజటారుద్రా, క్ష[7]మాలికాధరుల కాని కా రద్వైతుల్. ౫౬
[8]పాతకయుతేష్టదుష్ట, వ్రాతజగద్విప్రలంభవాదము కాక
ద్వైతము శిష్టవ్రాతగ్రా, హిత[మె] కలికాలకలుషహేతువ కాదే. ౫౭
ము న్నద్వైతవ్యామో, హోన్నతి[ని] సనత్కుమారుఁ డుష్ట్రం బయ్యెన్
మన్నింపక ధూర్జటి నని, [9]యెన్న న్విననయ్య నందికేశ్వరుచేతన్. ౫౮
ప్రీతిం దన [10]కూఁతున క, ద్వైతమహామోహయుక్తి పస[జ]జుఁ డతికా
మాతురుఁడై త్రెళ్లఁడె వి, ఖ్యాతమృగవ్యాధరుద్రకరశరనిహతిన్. ౫౯
వెండియు నభేదమతిఁ [11]గన, కాండజుఁ డీశ్వరుఁడ నేన యనవుడు సద్యః
ఖండితపంచమశిరమును, [12]రుండంబుగఁ జేసెఁ గాలరుద్రుం డతనిన్. ౬౦
ముందటిజలజాసనత, న్నందనులన చెప్పనేల నాస్తిక్యమునై
నెంద(ఱు) సెడ రద్వైతులు, గొందలమున దుష్ప్రబోధకుత్సితవృత్తిన్. ౬౧

1. వగుతురు. 2. సర్వానందా. 3. అద్వైతము. 4. సద్విద్యాద్వైతులకు. 5. గతిశిఖా. 6. యద్వైతులజా. 7. మాలికాధరులటనాద్వైతుల్. 8. పాతకయుతేష్ట. 9. యెన్నంవినరయ్య. 10. కూఁతునకుంద్వైతమహామోహోక్తి. 11. గనకాండజుఁడీశ్వరుండుఁన. 12. బుండంబు.

నీయైశ్వర్యాద్వైతము, నీయద్వైత మని దుర్వినీతులు కొంద(ఱ్)
పాయక వేదాంతాభి, ప్రాయము(ఁ) గదు(ఁ) దప్ప(ఁ)జెప్పి పఠియింతు రజా.

సర్వము నీ [1]యాధీన్యము, సర్వేశ్వర కాన గుణవిచారితవృత్తిఁ
సర్వంబు నీవ యనుశ్రుతి, నిర్వాహము(ఁ) బొందనేర్చు నిత్యానందా. ౬౩

[2]అద్వైతైకస్థితి నీ, యద్వైతము కాన యీశ్వరాద్వైతము స
ర్వాద్వైత మనఁగ వే(ఱు) జ, గద్విపరీతమగు[తత్త్వ]గతి గలదె శివా. ౬౪

ఇది గాదని శ్రుతి చెప్పిన, నది గ్రమ్మ(ఱ) నీస్వరూప మని చెప్పెడిదు
ర్మదు లగుమాయావాదుల, చదువులు వోవిడిచి నిన్నె చదివెద రుద్రా.

మాయావాదులముంద(ఱ), మాయావాదులకు వారిమార్గము [3]గీడి
స్సీ యని యొల్లక రోసి శి, వాయనమో [4]యనుచు నిన్నె వలగొందు శివా.



### జగత్కర్తృత్వ విచారము

ఏ [5]నిశ్చయుపరుఁడను నీ, శానుఁడు నాస్వామి యనుచు సంతతము[ను] [6]సం
త్రాణగతి స్వామిభృత్య, జ్ఞానంబున నిన్నె కొల్తు సర్వానందా. ౬౭

క్షణిక మచేతన మది ని[7], ర్గుణము జగత్కార్యకరణకుశ[లం] బగునే
గణనాతీతమహాగుణ, గణకృత్యవిహీన మైనకర్మము గలదే. ౬౮

పరికింప నచేతనములు, పరమేశ్వర మ(ఱి)ప్రధానపరమాణ్వాదుల్
పురుషుఁడు [8]చేతనుఁ డయ్యును, గర మజ్ఞుఁడుగాన(ఁ) గర్త గాఁజాలఁ డజా.

అవయవయుతములు గావున, [9]నవ[ని]ప్రముఖంబు లగుమహాభూతంబుల్
వివిధవితర్కవిచారణ, నవశ్యమును గార్యములు మహామహిమ శివా. ౭౦

శ్రీనాథవంద్య కర్తృవి, హీనంబ య్యున్నకార్య మెందును గలదే
కాన జగత్కార్యమునకు, గానప్రియ నీవ యాదికర్తవు రుద్రా. ౭౧

కర్త మఱి త్తని కర్తయుఁ, గర్మాధీనుఁ డని [10]విడిచి కర్తల మొదలం
గర్తపుఁడాయి నిన్నున, కర్మాధిపస్వతంత్రు(ఁ) గని కొలుతు శివా. ౭౨

శ్రుతిబాహ్యంబులు గావున, సతతంబును జైనబౌద్ధచార్వాకులదు
ర్మతములు వట్టక పట్టితి, శ్రుతిసారభవన్మతంబు సుమతి మహేశా. ౭౩

1. యాధీనము. 2. అద్వైత్యైకస్థితినదినీ. 3. గిడిస్సి. 4. వనుచు. 5. నిశ్చయ వరుండనీచా. 6. సంత్రాన. 7. నీగుణము. 8. సేతనుండు. 9. నవప్రముఖంబు. 10 విడచి.

కమలజకమలోదరరు, ద్ర[1]మహేశ్వర శాంత్యతీతతత్త్వాధిపతీ
ప్రముఖోర్ధ్వబిందునాద, క్రమతత్త్వ నిన్ను[నెట్లు]గని కొల్తు శివా. ౭౪
నె(ఱ)సినగురుప్రసాదము, వ(ఱ)లఁగ జగదేకసకలవల్లభుఁ డాదిం
గ(ఱ)కంఠుఁడ వేల్పని ని, న్న(ఱ)ఁగితి నీమహిమ[2] యె(ఱు)ఁగ నేమియు రుద్రా.
అండంబులు గావింపను, [3] వెండియు ప్రతిటింపఁ జె(ఱు)ప విష్ణ్వాదులు ను
ద్దండితశక్తిసమేతులు, చండీశ్వరవరద నీప్రసాదమున శివా. ౭౬
కీర్తింపఁగ లోకములకు(ఁ), గర్తలు విష్ణ్వాదు[4]లయ్యుఁ గా రాదిమహా
కర్త భవత్ప్రేరితు లై, వర్తిల్లుట గారణముగ వారలు రుద్రా. ౭౭
నారాయణాదుల[5]కుసం, సారిత్వము దెల్ల మెల్ల శాస్త్రంబులఁ ద
త్కారణమునఁ దత్కృతము వి, చారింప భవత్కృతంబు సర్వసందా. ౭౮
ఆర్యేశ్వర తమచేసెడి, కార్యములం దెల్లవారుఁ గర్తలు గారే
కార్యకరణత్వమాత్ర న, నార్యజగత్కర్త లనఁగవచ్చునె వారిఁ. ౭౯
తన తెగినతలయు [6]మడిసిన, తనయునిఁ బుట్టింపఁ గావఁ దా రోపనియా
వనజాసన కేశవులకు, జననస్థితికర్తృతాదిశక్తులు గలవే. ౮౦


భవాదిశబ్ద నివృత్తి

ప్రవితతషట్త్రింశత్త, త్త్వవితానంబులకు నుద్భవస్థానం బై
నివుడు రజోగుణసంగతి, భవుఁ డనునామంబు నీకుఁ బరఁగు మహేశా. ౮౧
మడియిల్లుతత్త్వముల వెను, బడక నిజాజ్ఞాప్రశస్తి భావింపఁగఁ [7]బొ
ల్పుదుసాత్త్వికగుణసంగతి, మృడుఁ డనునామంబు నీకు మేలిల్లు శివా. ౮౨
పరపగుతత్త్వములుఁ జరా, చరవితతులు సంహరింపఁ జాలినయతిభీ
కరతామసగుణసంగతి, హరుఁ డనునామంబు నీకు సమరు మహేశా. ౮౩
పరమస్వతంత్రనిర్మల, పరమానందాత్మ పరమభట్టారక ని
స్తర [ని] స్త్రైగుణ్యమహా, త్తర [8]రూపమ్మున శివాభిధానం బయ్యెఁ. ౮౪


జగత్కర్తృ లక్షణము

పరమస్వతన్త్రుఁడై యు, క్షరుఁడై సర్వజ్ఞుఁడై [9]వికారరహితుఁ డై
కరుణాకరుఁడై స్థిరుఁడై, పరగ జగత్కర్త యుండవలదె మహేశా. ౮౫
పరివిస్తృతసచరాచర, భరితానేకాండ మగుప్రపంచంబులకుం
బరమస్వతంత్ర శంకర, కరుణాకర నీవ యాదికర్తవు రుద్రా. ౮౬

1. మేశ్వరశాంతాతీతతత్త్వపతీ. 2. యరుంగ. 3. వెండియుం బ్రతిష్ఠింప. 4. లం యయ్యు. 5. కసంసారత్వము. 6. మడసిన. 7. బొబ్బము. 8. రూపమున. 9. వికారుఁడై.

భువనోత్పత్తిస్థితి[1]లయ, వివిధవ్యాపారముఖ్యవిభుఁడవు పశుబం
ధవిమోక్షదక్షుఁడవు స, ర్వ[2]వరప్రదుఁడవు[ను] నీవ రాజాభరణా. ౮౭

పరమాత్మ పరబ్రహ్మము, పరమేశ్వరుఁ డనఁగ నామపర్యాయంబుల్
హరునికివి మ(తి)[యుఁ] దత్త్వాం, తరవాచకములనిపలుకఁ దగదుమహేశా.

పరమాత్మ పరబ్రహ్మము, పరమేశ్వరుఁ డనఁగ హరియు బ్రహ్మయును బరా
పరవిభులు గారు శాస్త్రము, లరయఁగ జీవాత్మ లగుట నంద(ఱు) రుద్రా.

పరశబ్దంబున కర్థం, బరయఁగ నుత్కర్ష[3]మందు రయ్యుత్కర్షం
బొరులకుఁ గలుగునె శివ నీ, కరణి మహాదేవుఁ డొరుఁడు గలఁడే జగతిన్.

ఖరకరపద్మజరుద్రాం, బురుహోదరముఖ్యదివిజపుంగవసచరా
చరభూతనికరపంచా, వరణంబులు గొల్వ నుండువాఁడవు రుద్రా. ౯౧

ఏమని చెప్పుదు శంకర, నీమహిమాడంబరంబు నిఖిలాజాండ
స్తోమములుఁ బ్రకృతి నీయి, చ్ఛామాత్రన పుట్టునటె యసంఖ్యాతములై.

త్రిమలములును రాగద్వే, షములును [జన్మంబు] గర్మసంస్కారంబుల్
గమనాగమనాదులు నను, సమస్తమును లేవు నీకుఁ జంద్రాభరణా. ౯౩

[4]పతిసదృశాధికతాప, త్రితయగుణత్రితయజన్మమృతిసుఖదుఃఖ
క్షుతవృతబంధ[న]మోక్ష, స్తుతినిందాదులును లేవు ధూర్జటి నీకున్. ౯౪

ఓలిన దేవ యవిద్యా, కాలకళానియతి వికృతికార్యాకార్యా
ఖీలాబాంధవబాంధవ, మాలాబంధములు లేవు మతి నీకు శివా. ౯౫

అంచితమతి నెవ్వరు ని, ర్ణించిరె గుంచితసురులు నివృత్త్యాదికళా
పంచకసంచిత మైనప్ర, పంచము నీయట్ల రుద్ర పరమానన్దా. ౯౬

[5]వేదాద్యష్టాదశవి, ద్యాదిమహాకర్త నీమహత్త్వము వొగడన్
శ్రీదయితానల్లభవా, ణీదయితావల్లభులు[ను] నేరరు రుద్రా. ౯౭

స్వర్గాపవర్గసుఖము ని, ర్గళసామ్రాజ్యసుఖము నాత్మజవిద్యా
వర్గాదిలోకసుఖములు, భర్గ భవత్పాదభక్తిఫలములు రుద్రా. ౯౮


శివభక్తి వివరణము

ఒక్కం డీశ్వరుఁ డని మది, నిక్కముగా నెఱిఁగి భక్తినిష్ఠావృత్తిన్
ముక్కంటి నిమ్ముఁగొలిచినఁ, దిక్కక దొ(ర)కవె సమస్తదివ్యసుఖంబుల్.

---

1. విలయ. 2. వరప్రదుఁడవు. 3. మంత్రయమ్యుత్కర్ష. 4. పతిసదృశాధిక.
5. వేదానష్టా.

భక్తి నినుఁ గొలుచువలయును, భక్తియు ధర్మువునఁ గాని ప్రభవింప దతి
వ్యక్తముగ [1]ధర్మువును వే, దోక్తముగ [2]నెఱుంగవలయుఁ దుదిని మహేశా.
వేదోక్తసదాచారా, పాదనమున నెగడునట్టిపశువులకుఁ బురా
పాదితదురితక్షయ మై, యాదరమున ధర్మ మధిక మగు నీశానా. ౧౨౧
ధర్మాధిక్యంబున నతి, నిర్మలబోధయు విరక్తినిష్ఠయు(ఁ) గలయా[3]
కర్మష్ఠులకు నీప్రసాదము, పేర్మిని శివభక్తి పుట్టుఁ బ్రతిభానముగా. ౧౨౨
శివభక్తి సకలధర్మ, ప్రవరమహాధర్మమగుటఁ బరికింపఁగ భా
గ్యవిహీను లగు[దు]రాత్ములు, కనరయ్యముసు సంధివింప దశలోక శివా. ౧౨౩
మానితశివభక్తి [4]శివ, జ్ఞానధ్యానముల నీప్రసాదాతిశయా
నూనతఁ గర్మక్షయ మై, యానందప్రాప్తి ముక్తి యగు మను[జు]ఁ డజా. ౧౨౪
నరసుర[5]తిర్యక్స్వచరా, చరజీవుల కెల్ల భక్తిసంభావన నీ
కరుణ ప్రధానము ముక్తికి, [6]వరుసన యన లేదు భావ[7]సత్యంగ వగుటన్.
నరకస్థులు స్వర్గస్థులు, నర[8]తిర్యగ్గర్భయోనివనస్థాదివరా
త్కరములు భవత్ప్రసాద, స్ఫురణము [9]దొరకొనుడు ముక్తిఁ బొందుదురు శివా.
అరుదుగ భవత్ప్రసాదము, దొరకొను శివభక్తి(ఁ) గాన దుస్తరభవని
ష్ఠురదుఃఖసముద్ర[స]ము, త్తరణమహిత్రంబు భక్తి [10]దానయ్యె శివా. ౧౨౫
నియత మగుసకలపుణ్య, క్రియ లెల్లను భావశుద్ధికిని హేతువు ల
క్షయభాతి భావశుద్ధియుఁ, గ్రియగొన నీపాదభక్తికిని హేతు వజా. ౧౨౬
అతిగుహ్యంబులకంటెను, నతిగుహ్యతరంబు శివునియందుల భక్తి [స్థితి యని [11]మోహాంధులు వృథ, మతిఁ గొలుతురు వేఱ నిన్ను మనుజులు జలజాసనాచ్యుతాద్యమ, రులకును [నిదియిట్టి దని]నిరూపింప[ఁగ]న
గ్గల మగునీనిజరూపము(ఁ), దొలఁగక నీభక్తు లెఱు(ఁగుదురు సర్వజ్ఞా. ౧౨౭
వసుమతి(ఁ) జిత్రము జితచి, త్తసంభవా సకలధర్మ సతపస్య సజ్జా
ర్జనసమాధిభి[12]రప్యయ నీ, యనన్యశభక్తికిని క్రియుఁడ వగు దీశానా. ౧౨౮
వేయేమి [13]తోడఁ బలుకుదు, పాయక నినుఁ గొలుచునచలభక్తునిఁ గని [14]య
య్యా యని పిలిచినఁ బలికె, నో యని యెలుఁగీవె శంభు యురగాభరణా.

---

1. ధర్మవున. 2. నెఱంగ. 3. యకర్మిష్ఠులనీసంప్రసాదము. 4. శివాధ్యానజ్ఞానముల నీప్రసాదితిశయానూనసంత్కర్మక్షయమై. 5. తిర్యక్స్. 6 వరుసనయొన. 7. వస్యుంచ్ఛవగు. 8. తిర్యగ. 9. దొరకొనుండు. 10. దానయ్యె. 11. మోహాంధుల. 12. రప్యను. 13. తోడ. 14. యాతయ్యాయని......యలుఁగీవె.

వభక్తి లేక చేసిన, వివిధాధ్వరముఖ్యసకలవేద[1]పురాణా
దివిహితకర్మవితానము, లవి యెల్లను నిష్ఫలంబు లగు నీశానా. ౧౧౩

క్తియు [2]ముక్తి తెరువు వి, ధ్యుక్తముగ సమేయ[3]ప్రియచతుర్వేదా "మ
ద్భక్తశ్చ్వపచ"యను నా, సూక్తి ప్రధానమ్ముగాఁ బరూత్తముల కజా. ౧౧౪



భక్తుల మహిమ.

ానుసది [4]భక్తునిచేతన, ధన మతనికి యిచ్చునదియు [5]"తస్మైదేయం"
బనియును, "తస్మాద్గ్రాహ్యం", బనియును గల దనిరి వేదభక్తివిధిజ్ఞుల్.

కధ లేటికి "సచపూజ్యో, యథాహ్యహ"[6]మ్మనినవిధి యథార్థముగా మ
న్మథమర్దన నీభక్తులఁ, బ్రథితంబుగ నీవ కాఁగ భావింతు శివా. ౧౧౬

అతిమూఢుం డతిపతితుఁడు, సతి[7]దుర్గుఁడు నగవలన దతిశయభక్తి
స్థితి నెగడు నేని నాతం, డతిపండితుఁ డతిపవిత్రుఁ డతిసుజనుఁ డజా. ౧౧౭

అనయము [8]రుద్రాక్షవిభూ, తినియుక్తులయిండ్లదిక్కు దెసఁబోవకుఁడో
యని చాటింపనుఁ గాలుఁడు, తనపురి శివశాసనుంపు ధన్యం డగుటన్.

ఒండేమి భక్తిసంగతి(ఁ), బండాలుండైన భూతిశాసనధరుఁడై
యుండినఁ బూజ్యుఁడే యతనిన్, ఒండనఁగాఁ జనదు భక్తియోగమున శివా.

విను పరుసవేది సోఁకిన, యినుము క్రియ న్నిన్నుఁగొలిచి [9]యెవ్వండైనం [టన్.
త్రినయన యుత్తముఁ డనఁబడు(ఁ),[10]బూనరఁగ శివభక్తుఁ డగ్రపూజ్యుం డగు

అవిచారంబున నెప్పుడు, శివశాసనపూజనంబు సేయఁగవలయున్
శివభక్తులఁ గని జాత్యా, ది[11]విచారము విడువవలయు దృఢభక్తిమెయిన్.

తెవులు[ను] [12]లేమియు భయమును, శివభక్తుల కైనయెడలఁ జేకొని రక్షిం
పవలయుఁ బ్రియములు సేయఁగ, నవశ్యము[నువలయు]వారి కార్తవిధమునన్.

శివశాసనపూజనమున, శివుఁ డెంతయుఁ బ్రీతుఁ డగుట(ఁ)జేసి శివప్రీ
తివిధానము గారణముగ, శివశాసనపూజనంబు సేయఁగవలయున్. ౧౨౩

శివలాంఛనధరుఁ డగుమా, నవుఁ గనుఁగొని మునిఁగి లేచినవిధమునం జి
త్తవికాస మెసఁగ సత్క్రియ, లవశ్యమునుఁ జేయవలయు నతిలోక శివా. ౧౨౪

శివశాసనుఁ డగురుద్రా, క్షవిభూతిధృతాంగుఁ జూచి సన్నతి సాష్టా
ఙ్గిప్రుఁ డనునదియ విచారము, [13]శివునాజ్ఞయు నగుట శాస్త్రసిద్ధంబగుటన్.

---

1. పురాణోక్తవిహిత. 2. ముక్తికిం దెరువు. 3. ప్రియచతుర్వేదమద్భక్తశ్చ్వపచోయనిన సూక్తిం బ్రధానముగ. 4. భక్తిని. 5. తస్మైదేహంబనియదరో గ్రాహ్యం. 6. హంబనియనిన. 7. దుర్గుయుండు. 8. రుద్రాక్షా. 9. యవ్వండైనన్. 10. నోనరంగ. 11. విచారములు. 12. లేమిని. 13. శివాజ్ఞయనుట.

భక్తుల ప్రసాదమెప్పుడు, భక్తుల నా కేడుగడయు భక్తుల గతి యే
భక్తుల[1]పరవుడ[న]ని శివ, భక్తులఁ గొనియాడవలయు భక్తులకు శివా.
భక్తుల దవ్వులఁ గని శివ, భక్తులు వచ్చి రని పొంగి [2]బ్రతికితి నని పో
భక్తుల కెదురేగి యథా, శక్తిస్థితిఁ జేయవలయు సత్క్రియలు శివా. ౧౪౦
భక్తుఁడు లోకహితార్థుఁడు, భక్తహితార్థుఁడు శివుండు భావింపఁగనీ
యుక్తి [3]యథార్థమ్మని నీ, భక్తులఁ బూజింపవలయు భక్తులకు శివా. ౧౪౧
లోకానుసారికిని శివ, లోకము దొరకొనదు గాన లోకము నెమ్మిం
జేకొన[క] విడిచి శివ నీ, లోకము గావలయు భక్తిలోలుఁడు రుద్రా ౧౪౨
లోకము విడువనివానిని, లోకము విడువద[ని] విశ్వలోకేశ్వర నీ
లోకముఁ గోరెడుమనుజుఁడు, లోకము వోవిడుచు నీవ లోకముగ శివా.
గురుఁ డాదిఁ దనకుఁ గఱపిన, వెరవునఁ జని మీ(ఁ)ద భక్తివేదించిన న
గ్గురువు తము గడచి [4]చేసిన, పరవశుఁడై మఱవవలయు భక్తుం దన్నున్.
హర[నీభక్తి][5]నిషేధక, చరితలు వోవిడిచి నిన్నె చనఁ గొలిచి నిరం
తరభక్తుఁడై శివైక్యుఁడు, [6]నిరాణ యగుపసిఁడివోలె [7]నిలువఁగవలయున్.
కలనైన నొండు దైవము, గల దనియెడుపలుకు దక్కి కలఁ డొక్కఁడ కే
వలశివుఁడె దైవ మని ని, శ్చలభక్తి శివైక్యుఁ డుండు సంతతము శివా.
పరువడిన "యోఽనన్యదైన, స్మరణసకృ" త్తనఁగ నన్యసంస్మరణము[నం]
దిరువదియెనిమిది[8]కోటులు, నరకంబులఁ బొం దనాథనాథ మహేశా. ౧౪౭
[9]కర్త య[ని] నిన్ను నె(ఱి)ఁగినఁ, గీర్తింపఁడు వెండి తన్నుఁ గార్యాకార్యా
వర్తనలఁ గర్త నే నని, కర్త ప్రధానుండు గాన ఘనభక్తుఁ డజా. ౧౪౮
వ్యక్తముగ లింగతనుఁ డను, యుక్తి యె(ఱు)ంగుటకుఁ జాల నుత్కృష్టమగున్
భక్తైకతనుఁడు శివుఁ డను, యుక్తియె(ఱు)ంగుట సమస్తయోగానందా. ౧౪౯
భక్తి కను దేహభావ, వ్యక్తుఁడ వని నిన్ను నమ్మి వదలక భక్తిన్
భక్తులు నీ వని కొలిచిన, భుక్తియు ముక్తియునుఁ బడయుఁబోలు మహేశా.
శివుఁడు పరిపూర్ణుఁ డని మది, శివభక్తులఁ జూచి యతివిశేషప్రీతిన్
వివిధసపర్యలఁ దనిపిన, నవశ్య[మును]దానఁ బ్రీతి యగు నీకు శివా. ౧౫౧.

1. పరవుండ. 2. బ్రతికితిననిపోశివ. 3. యదార్థమని. 4. చేసినని. 5. నిషేధకాకి. 6. కన్నడమున, నిరాళి = స్వచ్ఛమైన, అని యర్థము. 7. నిలుపంగ. 8. గోట్లు. 9. కర్తయునిన్ను.

నిన్నుఁ గని తన్ను జగమును, బన్నుగ మఱపంగవలయు భక్తునిఁ గని యా
నిన్నును మఱవఁగవలయు జ, గన్నుత భక్తుండు నీనకా(ఁ) దెలిసి శివా.

జంగమలింగం బగుభ, క్తుం గని పూజింపఁడేని గోటివిధములన్
లింగార్చన చేసిన వృథ, జంగమ [1]ముత్తమము గాఁగ స్థావరమునకున్.

చూడఁగ శివభక్తునిఁ గని. వేడుకఁ గొనియాడఁడేని వృథ యాతనిమి
థ్యాడంబర[2] దేవార్చన, యోడునఁ బోసినజలంబుయుక్తి మహేశా. ౧౫౪

శివభక్తులఁ బూజింపక, శివపూజలు గోటివిధులఁ జేసిన వృథ యా
శివభక్తులఁ బూజింపుట, శివ[3]పూజలఁ గోటివిధులఁ జేయుట రుద్రా.

క్రియగొన జంగమలింగము, నియతిం బూజింపఁడేని నిష్ఫలములు స
త్క్రియలునుఁ బూజలు"లింగ, ద్వయంసమఖ్యాత"మనినవాక్యముప్రోయున్

ఇంటికి భక్తులు వచ్చిన(ఁ), గంటిమి మంటి మని వారి కాళ్లు(ం)గడుగన్
మంటఁ గని సీతువాసిన, కంటెను దురితములు వాయు గరకంఠ శివా.

రుద్రాక్షభూతిభూషణ, ముద్రాంకితు నెదురు గన్న ముదమున సాష్టా
ంగ్రుద్రుఁ డని తలఁపఁడేని శి, [4]వద్రోహుఁడు నరకగామి యగునుమహేశా.

హరిపద్మజవాసవవి, స్తరవిభవములునుఁ దృణీకృతము లనిన మహే
శ్వర నీవృథభక్తులకును, సురనరవిభవంబు లెంతచోద్యములు శివా. ౧౫౯

[5]అసమాణిమాదిగుణరస, [6]రసాయనమ్ములును నిఖిలరాజితరాజ్యా
దిసుఖంబులు శివసుఖమున, కసమానము లండ్రు నీశివైక్యులు రుద్రా.

ఆకాశము వొడగొగసిన, భూకంపం బైనఁ బంచభూతప్రళయ
వ్యాకులమైన[ను] మఱచి శి, వైక్యుఁడు[7] నిను విడిచి యొండు లాలింపఁడజా.

కులగిరులు [8]జిట్టఁ దిరిగిన, జలరాసులు మేరదప్పి చనుదెంచిన నీ
వల నె(ఱి)ఁగినదృఢభక్తుఁడు, చలియింపఁ డపారఘోర[9]సంసా[రమునన్.]

దిక్కులు వీడ్వడి కలసిన, దిక్కరులు మదంబు డిగ్గి తిరిగిన మఱి నీ
దిక్కెఱిఁగినదృఢభక్తుఁడు, పక్కం [10]డెవ్వరికిఁ గార్యభారమున శివా. ౧౬౩

భూతలముఁ దల్లడిల్లినఁ, బాతాళము బయలుపడ్డ బ్రహ్మప్రళయం
బేతెంచిన నీభక్తుఁడు, చేతులు ద్రిప్పక[యు] పూజసేయును రుద్రా. ౧౬౪

---

1. ముత్తమముం. 2. దనార్చనంయోడనం. 3. పూజలుం. 4. "శివద్రోహుఁడు నరకమందుఁబడును మహేశా," యని కవిప్రయుక్తమగునేమో! 5. అసమాదిణిమా. 6. రాసాయనములును. 7. నిన్నువిడిచియొండ్లాలింప. 8. దిఖ్ఖండిరగిన. 9. సంసారి. 10. డెవ్వరికినిం.

వేయేటికిఁ బ్రాణంబులు, వోయినఁ దమత[ల]లఁ దెగిన భువిభక్తులు ని
న్నాయతమతి [1]నభ్యర్చన, సేయక కుడువరు త్రిలోకసేవితచరణా. ౧౬౫
ఆయుధములుఁ గుసుమము లగు, నాయుధ్ధులు మెట్ల లగు మహోన్నతనగజముల్
వే యేల [2]గండశిల లగు(ఁ), బాయక నినుఁ గొలుచునచలభక్తులకు శివా.
అధన[ము న]త్యుత్తమ మగు, నధర్మమును ధర్మమగు[ను] నాగమవిధి స
ద్విధి యగు నిషేధమునుఁ జం, ద్రధరా భవదీయభక్తితాత్పర్యులకున్.
క్షుత్తృష్ణాదివిపత్తులు, [3]బత్తళి జలతపన[శీత]బాధాదులు ను
ద్వృత్తగతిఁ బొందవెఱచు ను, దాత్తభవద్భక్తియుక్తు లగువారి శివా.
పరపరివారిత్వము ని, ష్కరుణత్వము నిత్యయాచకత్వము నతిని
ష్ఠురకర్తృత్వము నెన్నఁడుఁ, బొరయవు నీభక్త[4]వరులఁ బురసంహారా. ౧౬౯
మరణపునగ్భుతాదు, శ్చరిత్రతాదుర్మ్ఖతా . . . .
పరతంత్ర[తా]మ లెన్నఁడుఁ, బొరయవు నీభక్తవరులఁ బురసంహారా. ౧౭౦
కోరరు మ(ఱ)చియు స్వర్గ, స్వారాజ్యప్రముఖనిఖిలసంభూతభవా
పారసుఖంబులు శివరస, భూరిసుఖాను[5]భవభక్తపుంగవులు శివా. ౧౭౧
నీ వని యొఱ(ఁ)గినపిమ్మట, నీవ యె(ఱుఁ)గు దని యుండు నీనిజభక్తుం
డావంతయు నే వని మెదు, భావనఁ గైకొనఁడుఁ గార్యభారమున శివా.
నీ వని యె(ఱి)ఁగినపిమ్మట, నేవలనికిఁ బ్రాలఁ [6]డొండు లెఱుఁగఁడు దనకున్
జీవన మె ట్లని తలఁపఁడు, భావనఁ గేవలశివైక్యభక్తుఁడు రుద్రా. ౧౭౩
మును రుద్రుఁడు గానియతం, డనుకీర్తింపండు రుద్రు[7]నర్చన భావ [ద్రా॰.
మ్మునఁ దలఁపఁడు సూడఁడు గా, వున శివభక్తుఁ డగుమానవుఁడు రుద్రుఁడు
జగదుపకారార్థముగా, [8]మొగి రుద్రులు రుద్రలోకముననుండి భువిన్
నెగడి శివభక్తు లనఁగా, నగణితముగ నవతరింతు రం ద్రాదిమునుల్.
మఱిఁ జూడ(ఁ)గ నివ్విధ మిా, క్షితి నిస్సందిగ్ధ మది యు శివభక్తులు వి
శ్రుతముగ మనుష్యచర్మా, వృతరుద్రుల యగుట(ఁ) దత్త్వవేదులదృష్టిన్.
కావున భక్తులు త్రిజగ, త్పావనులు భవాంధతమసపటలవిఘటనో
ద్భావితనిజమహిమార్కుఁవి, భావసు లవినాశు లతికృపాపరు లెందున్. ౧౭౭

1. కభ్యర్చన. 2, గండశిలలగు. 3. నత్తరి, ఇటయతితప్పినందునబత్తళి, యనుకన్నడశబ్దము "నత్తరి"కి బదులు గాఁ జెప్పఁబడినది. బత్తళి=నగ్నత్వము. 4. వరుల. 5. భవత్భక్త. 6. డొండ్లె ఱుఁగండు. 7. నర్చింపండుభావమున. 8. నొగి.

మానిసిపైతోఁ ల్గప్పిన, యీ వేషమున నున్నరుద్రు లీశ్వరభక్తుల్
మానుసులె వారు లోకహి, తానేకాచారు లీశ్వరాజ్ఞాధారుల్. ౧౭౯

మానుగ నెప్పుడు 'మద్భ, క్తా నవినశ్యంతి' యనఁగఁ దగియుండఁగ నీ
శాన భవత్కారుణ్యం. భోనిధి [1]ననుఁ దేల్చి ముక్తి (ఁ) గొందింపు శివా.

దేవా నాదుర్గుణములు, భావింపకుమయ్య నీకు భక్తుఁడ 'మద్భ
క్తావిగతకల్మషా' యను, నీవచనము నమ్మినాఁడ నిరుపమమహిమా. ౧౮౦

ప్రణుతింప [2]'నమేభక్తాః (ః) ప్రణశ్యంతి' యనఁగఁ దగినపలుకునకుఁ దగన్
గణనాథ భక్తచింతా, మణి రక్షింపవె యపారమహిమాధారా. ౧౮౧

హరిసరసిజాసనాదులు, సరి గా రని చెప్పు [శివధ] శాస్త్రము లెల్లన్
నరు లీశ్వరభక్తులకును, సరియగుదు రె జాతిరూపసామాన్యములన్. ౧౮౨

మండెడుమహాగ్ని [3]నుండెడు, పిండాయుష్మితిఁ బినాకిపృథుసన్నిధిమై
నుండెడి శివభక్తులతోఁ, నొండొకదుర్గనుజు లెనయె యూహింపంగన్.

మ్రొక్కుదురు లింగమూర్తికిఁ, దక్కటిమూర్తులకు మఱి[యుఁ]దమకలనైనన్
మ్రొక్కుద మని తలఁపరు నర, దిక్కుంజరు [4]లనఁగ నెగడు త్రినయనభక్తుల్.

[5]మడఁతి గోడు కర్థ మిది యని, యెడసేయరు భక్తి నిత్తు [6]రేలినపతికిం
బడయుదురు మగుడ వానిన, మృడుభక్తులు వలచి రేని [7]మెచ్చించి శివున్.

మలహరుఁడు జలకమాడిన, జలములు విషములకు మందు శస్త్రవ్రణసం
కులమునకు [8]దీపతైలము, త్రిలోచను[ని]భక్తులకు [స]తివిచిత్ర నిలన్.

తఱిగిన[9]తలలును నదుకును, మఱి కోసిననాలుకలును మసలక పచ్చం
గఱకంఠు[ని]భక్తుల కని, యెఱుఁగరె సద్య[ః]ప్రతాపు లీశ్వరభక్తుల్. ౧౮౭

పుచ్చినకన్నులుఁ గ్రమ్మ(ఱ), వచ్చును దేహంబు తోడిసి వ్రస్సిన[10]పుండుం
జెచ్చెరఁ దే(ఱు)ను భక్తుల, కచ్చెరువుగ శివునిమహిమ[నతి]శీఘ్రమునన్.

చేసినసుకృతము గుడుతురు, [11]భాసురముగఁ గర్మ లెల్లఁ బరలోకమునం
జేసి తగఁ గుడుతు రిందుల, నాసకలము నెఱుఁగఁ ద్రిభువనాధిపుభక్తుల్.

కలఁ డీశ్వరుఁ డనునమ్మిక, కలవాఁడే శివునిభక్తిఁ గలవాఁ డైనన్
మలహరుభక్తులఁ బెద్దలు, కులజులుఁ గులహీను లనఁగ(ఁ)గూడదు వారిన్.

1. నన్నుం దేల్చి. 2. నమేఽభక్తా. 3. నుండొండు. 4. లెనంగ. 5. మడదిగోడుక ర్థము మొదలని. 6. రేతిన. 7. మెచ్చింప. 8. దిపతైలము. 9. తలలునునదుకొను.

నియతాత్ము లనియతాత్ములు, నయవినయాన్వితులు నయవినయవర్జితు ల
   న్వయజు లనన్వయజులు ని, ర్ణయవిరహితమహిము లఖిలనాయకభక్తుల్.
నీచు లనీచులు పరిమిత, వాచులు వాచాలు రాత్మవశు [1]లవశులు స్వే
   చ్ఛాచారు[లవాఙ్మానస], గోచరచరితులు పినాకిహారిమిభక్తుల్. ౧౯౨
ఆరయఁ [2]బువ్వులకతమున, నారలు దలకెక్కునట్లు నానావిధసం
   సారులు శివభక్తిమెయిన్, వారక యెప్పుడుఁ ద్రిలోకవంద్యుల గారే. ౧౯౩
శ్వపచుండైనను శివభ, క్తిపరుం డగునేని నతఁడ ద్విజవర్యుం డా
   శ్వపచునకుఁ గీడు శివభ, క్తిపరాఙ్ముఖుఁ డైనయట్టిద్విజుఁడు మహేశా. ౧౯౪
ఫలమొందుప్రతిక్రి నైనను, గుల మమ్ముడువోవునట్లు గులమును బలముం
   గలిమియు విద్యయు సర్వము, మలహరుఁ డగుశివునిభక్తిమహిమయ కాదే.
ఇవ్వసుమతిఁ గడుఁ గమ్మని, పువ్వులలోఁ బుట్టినట్టి[3]ప్రువ్వులు గొ(ఱ)యే
   సర్వజ్ఞ[4]భక్తి విరహితుఁ, డెవ్వఁడు నుత్కృష్టజాతుఁ [5]డేటికిఁ గొ(ఱ)యే.
క(ఱ)కంఠభక్తి వెలిగా(ఁ), గొఱగా వెవ్వియును నవియుఁ గొన్నిటినాళ్లల్
   మ(ఱి)పింపకూడు వెట్టిన, మెరయల క్రియ మెరచుమీస మెదుకుల మెఱపుల్.
భవభావరజోదూషిత, లవుమనుజులబుద్ధివనిత లగణితదినముల్
   శివభావపుణ్యజలముల, నవగాహనసేయకున్న నశుచుల కారే. ౧౯౮
పుట్ట నని చచ్చి చా నని, పుట్టెడు [6]ప్రువ్వులువిధమునఁ బురహరుభక్తిన్
   ముట్టనిమనుజులు సచ్చుచుఁ, బుట్టుచునుండుదురు [7]ముక్తిపురి కెడ దవులన్
పూజింపఁడు పూజింపఁడు, పూజింపఁడు శివుని భక్తిఁ బూజింపఁడు మీ
   రోజ సెడి నడవకుండుఁడు, రాజులు రట్టళ్లు నగుట రా వెళ్లిటికిన్. ౨౦౦
అవిరలనిష్ఠాప్రవృత్తిని, భవదీయార్చనలు సేసి పడయుసుఖంబుల్
   సవిశేషభక్తి భక్తుల, [8]దవులంగని మ్రొక్కునతఁడు దానును బడయున్.
కని మ్రొక్కఁడు శివభక్తుల(ఁ), గొనియాడఁడు మీఁదనుగతి(ఁ)[9]గొనవలసిననా
   ల్లనినాఁ డూరకయుండుఁడు, మనుజులు [10]దెగడకుఁడు వారి మంద్రేయేనిన్
[11]అనఘులఁ గేవలభక్తులఁ, ననుషక్తిం గని "సుదూరమపిగన్తవ్య"
   మ్మన వర్ణించిన(ఁ) జాలదె, గొనకొని శివుఁజూడ వే(ఱ) కోరఁగ నేలా.

---

1. లవశులనివిష్టాచాయలుగోచరభరితులు. 2. బుచ్చుల. 3. పువ్వులు. 4. భక్తివిరహితులం డెవ్వండు. 5. డేంటికిం. 6. పువ్వులు. 7. విముక్తిపురికడవులన్. 8. దవ్వులంగని. 9 గనవలసిన. 10. దెగంగడకుండువారి మంద్రేయనిన్. 11. అనఘులుం గేవలభక్తులు.

శ్రీరస్తు.

# ఆంధ్రకవితాపిత.

శ్లో. “వాచా మాంధ్రమయీనాం యః ప్రవక్తా ప్రథమోఽభవత్
ఆచార్యం తం కవీంద్రాణాం వందే వాగనుశాసనమ్.” పూర్వశ్లోకము.*

పాశ్చాత్యసారస్వతప్రక్రియలును బాశ్చాత్యోహలును మనదేశమున వ్యాపింపకపూర్వ మాదినుండియు నాంధ్రకవితావనితామణికి మత్యమరాధిపాచార్యుండును విపులశబ్దశాసనుండును విద్యాదయితుండును లోకజ్ఞుండును సత్ప్రతిభాభియోగ్యుండును నగునన్నయభట్టోపాధ్యాయసార్వభౌముఁడే జనకుం డని మనవా రెల్లరును సంస్కృతకవులును నాంధ్రకవులును నమ్ముచుండెడువారు. ఇందులకుఁ బైశ్లోకమే ప్రమాణము. మఱియును నన్నపార్యునకచిరకాలములో నున్నట్టియు మనవారిచే నాదికాలపుఁగవులుగాఁ బరిగణింపఁబడినట్టియుఁ †దిక్కనాదు లీయూహనే కలిగియుండెడువారు. కవిబ్రహ్మ యను ప్రఖ్యాతి నందినయాదికాలపుఁగవి యగుతిక్కయజ్వకు శిష్యుం డగుమారనకవి తనమార్కండేయపురాణములో నన్నయభ “ట్టాంధ్రకవితాగురుఁ” డని విస్పష్టముగా వ్రాసియున్నాఁడు. తిక్కనకవివరునిమిత్రుఁ డగుకేతనకవియును దన యాంధ్రభాషాభూషణములోఁ దెనుఁగులక్షణమునకు నన్నయకవితయే యాది లక్ష్య మని రూఢిచేయుచు “నన్నయభట్టాదికవిజనంబులకరుణన్” అని నన్నయనే ముం దిడి నుడివియున్నాఁడు. తిక్కనయును నన్నయనుగూర్చి ముచ్చటించుటలో “విద్యాదయితుఁ” డనఁగా బ్రహ్మ యని వచించియున్నాఁడు. ఇటీ

---

* దీనిని బ్రతివాదులుకూడఁ బ్రమాణముగాఁ దీసికొని ప్రాచీనశ్లోకమని యంగీకరించిరి. చూ. కం. వీ. గారి యాంధ్రకవులచరిత్ర క్రొత్తకూర్పు.

† ఉ. భాసురభారతార్థములభంగుల నిక్క మెఱుంగ నేరమిన్
గాసటబీసటల్ చదివి గాథలు త్రవ్వెడుసంగువారికిన్
వ్యాసమునిప్రణీతపరమార్థము తెల్గుగఁ జేసినట్టి య
బ్జాసనకల్పులం దలఁతు నాద్యుల నన్నయతిక్కనార్యులన్.

పలివాఁ డగు రామరాజభూషణుఁడు మున్నగువారు "మహిమున్ వాగనుశాసనుండు సృజియింపఁగ" అనియు "చతురాస్య వాగనుశాసను" ననియు "ఆంధ్రవిద్వజ్జనాచార్య నన్నపార్య" ననియు "వాక్ఛాసనుం డగువాని నిక్కంబుగా నలబ్రహ్మదేవుఁడే యని నుతింతు" ననియు "నన్నయ కని పెట్టె నాఁడుకదా తిక్కనాదికవీంద్రుల కాదిభిక్ష" యనియు నన్నయయే యాంధ్రకవిత్వమునకు జనకుఁ డని వ్రాసియుండిరి. నన్నయ నాదికవి కాఁడని త్రోసివేయ నిచ్చలఁ జూచువారిలో నొక్క రగు బ్రహ్మశ్రీ జయంతి రామయ్యపంతులువారు నన్నప నాదికవినిగా జగమంతయుఁ దలంచుచున్నట్లు వ్రాసియుండిరి. వారివాక్యము నీక్రింద నిచ్చుచున్నాఁడను.

"Nannaya Bhattu is universally regarded as the father of Telugu poetry."

ఇట్లు పూర్వు లందఱిచేతనుగూడ సిద్ధాంతముగా నంగీకరింపఁబడిన యీయంశమును నిప్పటివా రకారణముగా శంకింపఁజొచ్చిరి. మనదేశభాషావిశేషాదులరహస్యముల బాగుగా నెఱుంగ నవకాశము లేనిపాశ్చాత్యులు నన్నయయే యాదికవి యనుప్రసిద్ధిని విని మొదటికవియే యంతనిర్దుష్ట మగు మహాగ్రంథమును విరచింపఁగలిగియుండునా యని శంకింపఁజొచ్చిరి. దానిం జేతఁబట్టుకొని పురాణవిద్యాప్రవీణు లగువారు కొందఱు మనవారుకూడఁ బూర్వపువ్రాఁతలనెల్లఁ ద్రోసిరాజని నన్నయకుఁ బూర్వము కవిత్వము కలదని యూహింపఁజొచ్చిరి. అవిచారపూర్వకముగా నీయూహ తలకెక్కినతరువాత తమనూతనవాదమును నిలుపుకొనుటకై నన్నయకుఁ బూర్వకవులను గవిత్వములనుగూడ మననవమేధావులు కనిపెట్టఁజొచ్చిరి. ఆంధ్రభాషాయోషకుఁ దోఁబుట్టువు లనువాడుక గలద్రావిడకర్ణాటకములందుఁ గవిత బహుకాలము నుండి కలదని మనవారు కనిపెట్టినతరువాత భాషాభిమానుల మనుకొనువారు కొందఱు త్రిలింగకవితాసుదతియొక్క వయసునుగూడఁ బొడిగింపఁ బ్రయత్నింపఁజొచ్చిరి. ఈవిశ్వప్రయత్నము చేయుటలో మొదట గురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారు మున్నగువారికి వేములవాడభీమకవి యాధారముగా లభించినాఁడు. శ్రీనాథునిపద్యము నొకదాని నాధారముచేసికొని శ్రీరామమూర్తిగారు భీమకవిని నన్నయకంటె ముందునకు లాగిరి. కాని విషయవిమర్శనముచేసిన పిమ్మట నీభీమకవి నన్నపార్యున కీవలఁ బడినాఁడు. తరువాత రావుబహాదరు వీరేశలింగముపంతులువా రాంధ్రశబ్దచింతామణి నాధారముగాఁ గొని కవి

భల్లటుఁ డనుసంస్కృతకవిని తెలుఁగుకవినిగాఁ దీసికొని నన్నయకు ముందిడఁ బ్రయత్నించి విఫలమనోరథులై కొంతకాలమునకుఁ బరువాత మరలఁ దామే భల్లటకవి నన్నయకుఁ బూర్వుఁడు కాఁడనియు నర్వాచీనుఁ డనియు వ్రాసిరి. ఇటీవల శ్రీమానవల్లి రామకృష్ణకవిగారను వారొక్కరు కుమారసంభవకారుఁ డగునన్నిచోడుని పైకినీడ్చి నన్నప్పకు ముందిడఁ గొంతగారడి కావించిరి. కాని గ్రంథపరిశోధనము తుద కాతనినిగూడ నీవలకు లాగినది. శ్రీ వీరేశలింగము పంతులువారు మున్నగువారే యీతఁడు నన్నయ కర్వాచీనుఁ డని నొక్కి-వ్రాయుచున్నారు. ఈవిధముగా నన్నపార్యునకుఁ బూర్వము పుట్టిన వనఁబడు గ్రంథము లన్నియుఁ బూర్వపక్షమై పోఁజొచ్చినవి. నన్నయకుఁ బూర్వపుకవు లదృశ్యులు కాఁజొచ్చిరి. ప్రయత్నము విఫలమైనపిమ్మట మననాగరకు లెక్కువ పట్టుతోఁ గనఁబడినతావులెల్లఁ దిరుగవేసి చూచుచుఁ దుద కొకశాసనరాజ మును సంపాదించిరి. దీనికే యుద్ధమల్లశాసన మని పేరు. ఈశాసనము పూర్తిగా లేదు. పూర్తి కానేకాలేదు. శాసనకాలముగాని శాసనము వ్రాయించినవాని కాలముగాని యిందుఁ దీఁబడి యుండలేదు. శాసన మొకటియో రెండో మూఁడో తెలియదు. శాసనము వ్రాయించిన దెవరో యేసంశస్థులోకూడ శాసనగాఁ దెలియదు. ఇట్టిశాసనరాజము నాధారముచేసికొని మనవారు కొందఱు నన్న యకుఁ బూర్వము పుట్టినదీశాసనమని వాదింప సాహసింపఁజొచ్చిరి. వారును వీరును వాదించుటమాట యటుండ భాషాభిమానులును బూర్వశాసనపరీక్షకాగ్రగణ్యులును బహుగ్రంథకర్తలును నగుబ్రహ్మశ్రీ మహారాజశ్రీ జయంతి రామయ్యపంతులువారు కూడ నీశాసనమును జిరకాలము పరిశీలించిపరిశీలించి తుదకు నిస్సారము లగుయుక్తులఁ గొన్నింటి నల్లి యది నన్నయకుఁ బూర్వ మని స్వవచనవ్యాఘాతములతోఁ గూడినయభిప్రాయము నొకదానిని వ్రాసి యాంధ్ర సాహిత్యపరిషత్పత్రికలోఁ బ్రచురించుటయే కాక దానినే యొకచిన్నగ్రంథము గాఁగూడఁ బ్రకటించిరి. వీరు వ్రాసినది లోకమును భ్రమింపఁజేయుచున్నది గాన సత్యనిర్ధారణార్థమై యాశాసనము నే నిందు విమర్శించుచున్నాను. వేత్త లగువారు మాయుభయులవ్రాఁతలను జిజ్ఞాసించి సత్య మగుసిద్ధాంతమునకు వత్తురుగాక.



## యుద్ధమల్లశాసనకాలము.

నన్నయకుఁ బూర్వపు దని తెల్పఁబడునీయుద్ధమల్లశాసనములో నే నిది

పురుషులకాలముగాని యీయఁబడియుండలేదు. కాలవివరణము లేనేలేదు. ఇఁక నీశాసనము సత్యనిర్ధారణము చేయ సత్యప్రయత్నము చేయువారి కెట్లు పనికివచ్చును? వెనుకటిమహాకవులు వ్రాసినవ్రాఁతల నెల్లఁ ద్రోసివేసి క్రొత్త సిద్ధాంతము చేయఁ దలఁచినప్పుడు మనకు నూతనముగా లభించినయాధారము దృఢమైనదిగా నుండవలెనుగదా. ఇది యట్లు కాలనిర్ధారణము చేయుశాసనము కానేకాదు. ఇఁక దీనికాల మెట్లు తెలియుననిన నయ్యది మనయూహలపై నాధారపడియున్నది. ఇట్టిసందిగ్ధశాసనమునుబట్టియా పూర్వులవ్రాఁతలఁ బూర్వపక్షముచేయుట! అది యటులుండ వీ రూహలపైఁ జేసినకాలనిర్ణయమైనను బహుసందేహములఁ బుట్టించునదిగా దుర్బలమై యున్నదికాని చక్కని నిర్ధారణము కలదిగా లేదు. వీరు శాసనమునం దుదాహరింపఁబడిన రాజులఁ బట్టియును దానిలిపినిబట్టియును దమయభీష్టానుకూలముగాఁ గాలనిర్ణయము చేయ సాహసించిరి. ఈశాసనకాలనిర్ణయముంగూర్చి శ్రీరామయ్యపంతులవారిట్లు వ్రాసియున్నారు.

"శాసన మెప్పుడు పుట్టినదియు నిర్ణయించుటకు ముఖ్యాధారములు రెండు కలవు. అక్షరములపోలిక యొకటి, శాసనమునందుఁ బేర్కొనంబడిన యుద్ధమల్లు లెవ్వరైనదియు నిరూపించుట యొకటి."

శ్రీరామయ్యపంతులుగారు చెప్పినది సరసముగానే యున్నది. శాసనములోఁ గాల మీయఁబడియుండనప్పు డవకాశ మున్నచో దానియం దీయఁబడియున్నరాజులకాలముంబట్టిగాని లిపినిబట్టిగాని కాలనిర్ధారణము చేయుట యుచితముగానే యుండును. కాని యవియైనను నసందిగ్ధములుగా నుండవలయునుగదా. ఈశాసనమునం దవియును సందేహాస్పదములుగానే యున్నవి. మొదట శ్రీరామయ్యపంతులువారీశాసనమునం బేర్కొనంబడినరాజుల నెత్తికొనిరి. కాన మనము నిందుఁ బేర్కొనఁబడినరాజు లెవ రనువిచారమును ముందు గావింతము.

శ్రీరామయ్యపంతులవారు శాసనములోఁ జెప్పఁబడిన రాజులంబట్టి కాలనిర్ణయము చేయుటకై కడంగుచు నీక్రిందిరీతిని లిఖించిరి.

"ముందుగా నీయుద్ధమల్లు లెవ్వరో చూతము. మొదటిశాసనములోని యుద్ధమల్లుఁడు చళుక్యరాజని (రాజసల్కిభూవల్లభుండు) చెప్పఁబడినది. చళుకగా నెనగొనఁబడిన వేఁగిచాళుక్యరాజవంశములోనివాఁడు కావలయును."

ఇందులో "చళుక్యరాజైనయెడల" అనుపదములు శ్రీరామయ్యపంతుల వారి కిందుఁ జేర్కొనఁబడినరాజులు తప్పక చళుక్యవంశమువారే యని తెల్పుటకుఁ దగినమనోదార్ఢ్యము కలుగలేదని తెలుపుచున్నవి. అట్లుకాక తమ కిందుఁ గలరాజులు చాళుక్యరాజులే యని నూఢిగాఁ దోఁచినచో "చళుక్యరాజైనయెడల" నని "ఎడల" ప్రయోగము చేయనేల? ఈ "యెడల" శబ్దము శ్రీరామయ్యపంతులవారి కీవిషయములో సందేహము కలదని తెలుపుచున్నది. ఆసందేహమునకుఁ గారణము లేకపోలేదు. ఏమన:—

ఇచటిరాజులు చాళుక్యు లనుట కాధారమున్నదా?

ఇందుఁ జేర్కొనంబడినరాజు చళుక్యరా జని నూఢిగాఁ జెప్పుటకుఁ దగినయాధార మేదియును నిందు లేదు. ఆంధ్రదేశమం దున్నచళుక్యరాజుల శాసనములలో "చళుక్యకుల" మని స్పష్టముగాఁ దెల్పఁబడుచున్నది.* ఇందుఁ జళుక్యశబ్దమును లేదు. కులప్రశంసయును లేదు. ఇఁక శ్రీరామయ్యపంతులవా రిందలిరాజులది చళుక్యకులమై యుండు నని యెట్లు తలంచి రన, శాసనములో "రాజసల్కి భూవల్లభుండు" అనుపద మొకటి కలదు. దీని నాధారము చేసికొని శ్రీరామయ్యపంతులవా రీరాజుకులము చాళుక్యకుల మని తలంతురంట; సల్కి శబ్దము చళుక్యశబ్దభవ మని యూహింతురంట! ఈవిషయమై వీ రిట్లువ్రాసిరి. "సల్కి (పంక్తి ౭) ఇది చళుక్యశబ్దభవము."

ఇట్లు శ్రీరామయ్యపంతులుగారు వ్రాయుటకుఁ దగినయాధార మేదో తెలియవచ్చుట లేదు. అక్షరములపోల్కి యొకింత (మేనమామపోలిక) యున్నంతమాత్రమున సల్కి శబ్దము చళుక్యశబ్దభవ మనవచ్చునా! కానిందు. తద్భవములు వర్ణలోప, వర్ణాగమ, వర్ణవ్యత్యయములచే నగునుగదా, యింత యవకాశ మున్నప్పుడు చళుక్యశబ్దమునుండి సల్కి యైనదనరాదా యందురేని నట్లనినను సమన్వయించుట లేదు. శాసనములో "రాజసల్కి భూవల్లభుఁ" డని కదా యున్నది. శ్రీరామయ్యపంతులవారివాదముంబట్టి సల్కి యనఁ జళుక్యుఁ డని యర్థము చేసికొందము. అట్లు చేసికొనిన నర్థము వ్యర్థ మగును. రాజ

* మానవ్యసగోత్రాణాంచలుక్యానాం కులమలంకరిష్ణోః — సర్వలోకాశ్రయుని శాసనము.
చాలుక్యానాంకులమలంకరిష్ణోః — శక్తివర్మ శాసనము.
చాలుక్యానాంకులమలంకరిష్ణోః — నందంపూడి శాసనము.
చాలుక్యానాంకులమలంకరిష్ణోః — పశ్చిమచాళుక్య శాసనము.

చళుక్యభూవల్లభుఁ డనికదా తేలును. దీనియర్థ మేమి? చళుక్యశబ్దమునకు ముందు రాజశబ్దమును దరువాత భూవల్లభశబ్దమును నుండ నేల? వీనికి సమన్వయ మెక్కడ నున్నది? ఎచటను లేదుగాన సల్కిశబ్దము చళుక్యశబ్దభవమనిన నిట నర్థము లేదు. కాన సల్కిశబ్దము చళుక్యశబ్దభవ మనుటలో సారస్యము లేదు. శాసనములో సల్కికుల మనియున్నచో నయ్యది వంశముంగూర్చినపద మనుకొందుము. కాని యదియును లేదు. ఇది కులముం దెల్పునది యని చెప్పుటకే యవకాశము కాన్పించుటలేదు. శ్రీరామయ్యపంతులువారు సల్కి యనఁ జళుక్యకులమే యనుటకుఁ దగినయాధారములఁ దృప్తికరమగువానిని నితరస్థలములనుండి చూపఁగలిగియుండలేదు. శక్తివర్మప్రభుబట్టుశాసనమునుండి "సకలేశ్వరుఁ" డ*నుపదమును దీసికొని దానిని దమవ్రాఁతలో సలికిగా మార్చి యా "సలక" శబ్దముకూడ చళుక్యశబ్దభవమే యని నుడివిరి. కాని యదియును వంశముంగూర్చి తెల్పునది కాదు. ఈశ్వరునిగూర్చి వాడఁబడినపదము. కాన సలికేశ్వరశబ్దముంబట్టి చలుక్యశబ్దభవము సల్కిశబ్దమనుట మహాసాహసము. మఱియును శక్తివర్మశాసనములో "సకలేశ్వరుఁ" డనియున్నదిగాని సలికీశ్వరుఁ డని లేదు. సలికిశబ్దము సల్కియగునుగాని సలకశబ్దము సల్కి కానేరదు. అయిన సల్క కావలెను. శ్రీరామయ్యపంతులువా రింకనొక ప్రయోగముంగూడఁ జూపిరి. వా రిట్లు వ్రాసిరి.

"నాదగ్గఱ నున్న చళుక్యభీమునినాఁటి తామ్రశాసన మొకదానిలో "తత్సూను ర్విజయాదిత్యో భీమసల్కినామానమ్ తత్పక్షదక్షిణగంగబలంచ నిర్జిత్య" యని ప్రయోగమున్నది."

ఈచిన్నివాక్యముంబట్టి విజయాదిత్యుఁ డెవఁడో వానిచే జయింపఁబడిన చళుక్యభీముఁ డెవఁడో తెలియవచ్చుటలేదు. పూర్వచాళుక్యులలోని చాళుక్యభీము లెవరును విజయాదిత్యునిచే జయింపఁబడినట్లు కాన్పింపదు. కానఁ బూర్వచాళుక్యులలోనివిజయాదిత్యులు పూర్వచాళుక్యులలోనిచాళుక్యభీముల నిర్జించుటయనునది యసంగతము. కావున విజయాదిత్యునిచే జయింపఁబడినట్లీశాసనమునఁ దెల్పంబడినభీమసల్కి గాంగుఁడో కదంబుఁడో కావలయును

* శ్రీరామయ్యపంతులువారు పరిషత్పత్రికలో (సంపుటము 2 సంచిక 4 లో) ప్రచురించినయాశాసనమునందు "సలకే" అని యున్నది. ఇది సలకే యగును గాని సలికే కాదు. శ్రీరామయ్యపంతులవారు తమయిచ్చవచ్చినట్లు పదములనేల దిద్దిరో తెలియరాదు. శాసనములో ల మీఁద దుకట్టువలె కలదుగాని గుడి లేదు.

గాని చాళుక్యుఁడు కానేరఁడు. రాజసల్కి, భీమసల్కియని యీ "సల్కి" శబ్ద ముత్తరపదముగాఁ గాన్పించుచున్నది. భీమసల్కి యనఁజళుక్యభీముఁడనునర్థము వచ్చుచో రాజసల్కియనఁ జలుక్యరాజని తేలును. అట్లయిన మరల భూవల్లభ పద మెందులకు? చళుక్యరాజభూవల్లభుఁ డనుపదమును సార్థకము చేయఁ జూచుచోఁ జళుక్యరాజనరేంద్రుఁడని యర్థమగును. అట్లయిన నిది రాజనరేంద్రునిశాసనము కావలసివచ్చును.




సలకేశ్వరుఁడన సలకరాజుచేఁ బ్రతిష్ఠింపఁబడినయీశ్వరుం డని యర్థము చెప్పుకొనుచో నీసలకరాజు లెవ రని విచారింపవలసియున్నది. సలకరాజు లచ్యుతదేవరాయనివంశముతో సంబంధించినవారు. ఈవిషయ మచ్యుతరాయాభ్యుదయమువలన స్పష్టము కాఁగలదు. అం దిట్లున్నది.

"మహత్తరే మానవలోకశాసితు ర్నవోనుకూలా మహిషీపదేశదా
కృతాభిషేకా సలకక్షితీశితు ర్వరాత్మజా సీవ్వరదాంబికా వధూః."

కావున సలకేశ్వరుఁ డీసలకరాజు వంశస్థులచేఁ బ్రతిష్ఠింపఁబడినవాఁ డనవలెను.

మఱియును వసుచరిత్రములోఁ గూడ "మహిమసలకఖురస్థయమడంచి" యనిసలకరాజు చెప్పఁబడియెను. కాన నీసలకవంశస్థులచేఁ బ్రతిష్ఠింపఁబడిన దేవుఁడు సలకేశ్వరుఁడు కావచ్చునందురా? అగుఁగాక.

కాన శ్రీరామయ్యపంతులువా రెత్తినశాసనమునుబట్టి మనసంశయము తీరనేరదు. శ్రీరామయ్యపంతులవారు శాసనమునంతను నిచ్చినను బాగుగా నుండును. అట్లీయక యొకచిన్నవాక్యమును నెందునుబోలనిదాని నిచ్చిరి.* దీనియం దున్నసల్కిశబ్దము చళుక్యశబ్ద మనుటకంటె నన్యమేమో యను సంశయముకూడఁ గలుగుచున్నది. కావుననే శ్రీరామయ్యపంతులవారు "ఎడల" శబ్దప్రయోగమును జేసి తమసంశయమును లోకులకుఁ దెల్పిరి కాఁబోలు.

పోనిండు శ్రీరామయ్యపంతులవారు తలంచినట్లుగా "రాజసల్కిశబ్దము" చళుక్యవంశమునే తెల్పుచున్నదనుకొందము. అంతమాత్రముచేత నీచళుక్యులు పూర్వచళుక్యు లనుకొనుట యెట్లు? పరికించిచూడ నీశాసనమునందలి రాజు చళుక్యరాజు కాఁడనియు నందులోఁ బూర్వచాళుక్యుఁడు బొత్తిగాఁ

* చళుక్యభీమునినాఁటి శాసనమనుటచేత నాశాసన మెవనిదోకూడఁ దెలియవచ్చుటలేదు.

గాఁ డనియుఁ దోఁచుచున్నది గాని యీతఁడు పూర్వచాళుక్యుఁ డగుట కాధార మేదియును లేదు. ఏమన:

1. ఈశాసనము చాళుక్యులశాసనమును బోలియుండలేదు. 2. చాళుక్యుల మానవ్యసగోత్రము గాని యిష్టదైవతము లగుమాతృగణాదులు గాని 3. విశేషించి పూర్వచాళుక్యులబిరుదములు కాని యిందుఁ గాన్పించుటలేదు.

ఈశాసనములో గోత్రప్రశంస లేదు. మాతృగణదేవతాదులమాట లేదు. చళుక్యవంశవర్ణన మింతయును లేదు.


ఇందుల బిరుదములంగూర్చి.

ఈయుద్ధమల్లశాసనము చాళుక్యశాసన మనుటకును నందులోఁ బూర్వచాలుక్యుల దనుటకును నిం దీఁబడియున్నరాజబిరుదములు కొంతయభ్యంతరమును గలిగించుచున్నవి. శ్రీమదాంధ్రభారతములో నన్నయశంభుదాసులు వ్రాసినవ్రాఁతలనుబట్టియును విన్నకోటపెద్దన వ్రాసినకావ్యాలంకారచూడామణినిబట్టియును శాసనములనుబట్టియును బూర్వచాలుక్యులలో రాజనరేంద్రునివఱకును గలబిరుదము లేవో మన మెఱుంగుదుము. వానియందుఁ జేర్పఁబడినబిరుదము లేవియును నిం దీఁబడియుండలేదు. మఱియును నీశాసనమునం దీఁబడియున్నబిరుదము లేవియును వానియం దీఁబడియుండలేదు. ఇది గొప్పవింతకాదా! నన్నపార్యుఁడు వాడినబిరుదములు విన్నకోటపెద్దన గ్రంథమునందును శాసనములందును గాన్పించుచున్నవి. వానియం దున్నవి నన్నయగ్రంథమునఁ గలవు. కాని యీశాసనమునం దున్నబిరుదములుమాత్ర మెచ్చటను గానరావు. ఇవి కేవలమును గ్రొత్తవిగా నున్నవి. చదువరుల కీవిషయము బోధపడుటకై తగునుదాహరణము లిచ్చుచున్నాను.


నృపాంకుశబిరుదముంగూర్చి.

యుద్ధమల్లశాసనములో "నృపాంకుశ"బిరుద మొకటి కాన్పించుచున్నది. అదిభారతాదులందుమాత్రము కానరా కున్నది. భారతాదులనుబట్టియును శాసనములనుబట్టియునుగూడఁ బూర్వచాలుక్యులకు "త్రిభువనాంకుశ" బిరుద మున్నట్లు కాన్పించుచున్నది గాని "నృపాంకుశ"బిరుద మున్న ట్లెచటను గానరాదు. త్రిభువనాంకుశబిరుదము చాలఁ బ్రసిద్ధి గలిగియున్నది. నందంపూఁడిశాసనములోఁ బైముద్రమీఁద "త్రిభువనాంకుశ"అని చెక్కఁబడియున్నది. ఈవిషయమై జయంతిరామయ్యపంతులవారు క్రిందిరీతిని వ్రాసియున్నారు.

"కంకణ మతికినచోట నొకదిమ్మ యున్నది, దిమ్మనడుమ నుబికినయక్షర ములతో "శ్రీత్రిభువనాంకుశ" యని చెక్కఁబడి యున్నది. మఱియును భారత ములో "త్రిభువనాంకుశ"బిరుద మున్నదని శ్రీరామయ్యపంతులవారే యిట్లు వ్రాసిరి.

"త్రిభువనాంకుశబిరుదమునకు భారతప్రయోగము "త్రిభువనాంకుశ దీప్తినిధీ సమ, స్తభువనాశ్రయ ధర్మధురంధరా"—(ఆది. ఆ. 4 ప. 273.)

ఈత్రిభువనాంకుశబిరుదము క్రీ. శ. 799-843 వఱకుఁ బరిపాలించిన రెండవవిజయాదిత్యునినాఁటినుండియుఁగూడ నున్నట్లు కాన్పించుచున్నది. అట్టి సుప్రసిద్ధబిరుద మీశాసనములో లేదు. శాసనమునం దున్ననృపాంకుశబిరు దము భారతాదులందుఁ గానరాదు.

రాజాశ్రయబిరుదమునుగూర్చి.

యుద్ధమల్లశాసనములో రాజాశ్రయబిరుద మొకటి కాన్పించుచున్నది. ఇదియును భారతాదులందుఁగాని చాళుక్యులశాసనములందుఁగాని కాన్పించుట లేదు. గ్రంథములందును శాసనములందును నీపూర్వచాళుక్యులకు "సర్వలో కాశ్రయ"బిరుదముమాత్రము కాన్పించుచున్నది. ఇందుల కొకకొన్నియుదా హరణముల నిచ్చుచున్నాను.

శాసనములలో—

"శ్రీవిష్ణువర్ధనమహారాజస్య పుత్రః శ్రీసర్వలోకాశ్రయమహారాజః" సర్వలోకాశ్రయునిశాసనము.

"సర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధనమహారాజాధిరాజః" నందంపూడిశాసనము.

"సర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధనమహారాజధీరః" శక్తివర్మశాసనము.

భారతములో—

"ఉ. ఆశ్రితపోషణంబున స♦నంతవిలాసమునన్ మనీషి వి
ద్యాశ్రమ తత్త్వవిత్త్వమున ♦ దానగుణాభిరతిన్ సమస్త వ
ర్ణాశ్రమధర్మరక్షణ మ♦హామహిమన్ మహి నొప్పు సర్వలో
కాశ్రయుఁ డాదిరాజనిభుఁ ♦ డత్యకలంకచరిత్రసంపదన్."

కావ్యాలంకారచూడామణిలో—

"ఉ. అశ్రుతవైరివర్గుఁడు స♦మాశ్రితభర్గుఁడు దివ్యవాహినీ
విశ్రుతకీర్తి పుణ్యగుణ ♦ వేషవిభూషితమూర్తి-మానసో

స్త్నిశ్రితరాజనీతి యుధ◆ మీాకృతభూవరభూతి సర్వలో
కాశ్రయచక్రవర్తి సమ◆దారిచయూాసనువృత్తి శూరతక్.''

రెండవవిష్ణువర్ధనునుండియు సర్వలోకాశ్రయబిరుదము కాన్పించుచున్నది, గాని యీసుప్రసిద్ధబిరుదము యుద్ధమల్లశాసనములో లేదు. శాసనమందున్న రాజాశ్రయబిరుదము భారతాదులందుఁ గానరాదు. సమస్తభువనాశ్రయబిరుదము సర్వలోకాశ్రయబిరుదము వంటిదే. భారతాదులందున్నది. ఈ శాసనములో లేదు.

త్రిభువనాభరణబిరుదము.

యుద్ధమల్లశాసనములోఁ త్రిభువనాభరణబిరుదము కాన్పించుచున్నది. భారతాదులం దిది లేదు. ఇది యొకబిరుదమే కాదేమో.

ఇంకను భారతాదులం దనేకసుప్రసిద్ధబిరుదములు కలవు. అవి యేవియును నిందు లేవు.

సత్యత్రినేత్రబిరుదము.

ఇది యీయుద్ధమల్లశాసనములోఁ గాన్పించుచున్నదిగాని భారతాదులందుఁ గానరాదు. వానియందు సత్యాశ్రయబిరుదము కాన్పించుచున్నది. ''సత్యాశ్రయకులశేఖర, నిరవద్యవినయరాజరాజ'' అని భారతమునందున్నది. ఈసత్యాశ్రయబిరుదము చాలప్రసిద్ధి కలది. బహుశాసనములందుఁ గలదు. బహువ్యాప్తి కలది. ఇది కీర్తివర్మతండ్రి యగుశ్రీపులకేశివల్లభమహారాజుకాలమునుండి యున్నదని యాంధ్రులచరిత్ర చెప్పుచున్నది. ఇట్టిసుప్రసిద్ధబిరుద మీాయుద్ధమల్లశాసనములో లేదు. పైఁగాఁ జాళుక్యుల కెచ్చటను గాన్పింపని ''సత్యత్రినేత్ర''బిరుదముమాత్రము యుద్ధమల్లశాసనములోఁ గాన్పించుచున్నది. ఇంక నీశాసనము పూర్వచాళుక్యుల దనుట యెట్లు? ఇట్టిబిరుదములు లేకపోవుట సంశయమును గలిగించుట లేదా?

రాజమార్తాండ, పరగండభైరవ, త్రిభువనాంకుశ, రాజనారాయణ, విష్ణువర్ధన, సర్వలోకాశ్రయ, సత్యాశ్రయ, రాజపరమేశ్వర యనునవి పూర్వచాళుక్యులకుఁ బూర్వమునుండియు సామాన్యముగా వాడఁబడు ప్రసిద్ధబిరుదములు. ఇవి యేవియును నీయుద్ధమల్లశాసనమునందుఁ గానరావు. ఈశాసనమునందున్న నృపాంకుశ, రాజాశ్రయ, త్రిభువనాభరణ, సత్యత్రినేత్రబిరుదములు పూర్వచాళుక్యులసంబంధము గలగ్రంథములందుఁగాని శాసనములందుఁగాని

కానరావు. కాన నిది చాళుక్యశాసనము కాదనియుఁ బూర్వ[illegible] మొదటనే కాదనియుఁ జెప్పవలసివచ్చుచున్నది.

రాజనరేంద్రునికాలమునకు లేనిబిరుదులు తూర్పుచాళుక్యులలో నిటీవలఁ గలుగఁ గూడదా? కావ్యాలంకారచూడామణి కృతినందినచాళుక్యవిశ్వేశ్వరునకుఁ "గరవాలభైరవుఁ" డనుబిరుదు కలుగలేదా? అది భారతమునందును శాసనములందును గలదా? అందు లేని, అట్లయిన నృపాంకుశాదిసాత్విక బిరుదములు కలయుద్ధమల్లుఁడు రాజనరేంద్రునకుఁ బూర్వుఁడు కాక యిటీవలివాఁడు కావలసివచ్చును. చాళుక్యులలో రాజనరేంద్రునివఱకును గల బిరుదముల బహుమార్గముల చేసిన మెఱుంగుదుము కదా. ఈయుద్ధమల్లుఁడు చాళుక్యుఁడైనచో నిటీవలివాఁడు కావలెను. అనఁగా రాజనరేంద్రునితరువాతివాఁడు కావలెను. "పూర్వకవులయొక్కయుఁ బూర్వరాజులయొక్కయుఁ గాలనిర్ణయము బలవత్ప్రమాణైకసాధ్య" మని రామయ్యపంతులవారు తుదకు బహుముఖప్రమాణాధారమును దీసికొని శాసనమునందలి యుద్ధమల్లునికాలనిర్ణయము చేయఁగడంగిరి.

శాసనమువలనఁ దేలుమతముంగూర్చి.

ఈయుద్ధమల్లశాసనముంబట్టిచూడ నీశాసనము వ్రాయించినరాజు వీరశైవుఁడుగాఁ గాన్పించుచున్నాఁడు. శ్రీరామయ్యపంతులవారు చెప్పెడుదానిని బట్టిచూడ నీతఁడు వీరశైవుఁడు కావలసివచ్చుచున్నది. ఈయుద్ధమల్లుఁడు గట్టించినమఠములో శైవులే కాని యితరులు నివసింపరాదని శాసనము శాసించుచున్నది. ఇతరులు నివసించినఁ గాశిలో హత్యచేసినపాపముం బొందుదురనియు, నీయొట్టు మన్నింపక శైవేతరులు మఠములో బసచేసినయెడల దేవస్థానాధికారులును రాజును వారల వెడలఁగొట్టవలయు ననియు నట్లు వెడలఁగొట్టుటవలన నశ్వమేధము చేసినఫలమును నుపేక్షచేయుటవలన లింగమును బగులఁగొట్టినపాపమును గలుగునని యిందుఁ జెప్పఁబడియున్నది. మఠములో బసకూడ శైవేతరులు చేయరాదఁట! ఇది వీరశైవునిపని కాక మఱియొకటి కాఁగలదా? రాజనరేంద్రునివఱకును గలచాళుక్యులు పార్వతీపతిపదాబ్జధ్యానపూజారతు లనుటకు సందియము లేదు గాని వీరశైవులు కారు. భగవన్నారాయణప్రసాదసమాసాదితవరవరాహలాంఛను లగుటచే విష్ణువునందును భక్తి కలవారు. శివునందు భక్తికలవారే గాని తాము కట్టించినమఠములో నితరులు

బసచేయఁగూడ దనుసంతతివీరశైవులు కారు.* రామానుజమతము బయలు దేఱినతరువాతఁ గాని శైవము ముదిరి వీరశైవము కాలేదు. కాన వీరశైవునిచే వ్రాయింపఁబడిన యీశాసనము రాజరాజున కీవలిది గాని యావలిది కాదు. చాళుక్యులవరాహలాంఛనమే వారివిష్ణుభక్తిని జెప్పుచున్నది.

శాసనములో యుద్ధమల్లుఁడు కార్త్తికేయునకు భక్తుండై యాతనికి గుడి కట్టించిన ట్లున్నదనియుఁ జాళుక్యులు కార్త్తికేయభక్తు లనియుఁ జెప్పుదురా? వారు కార్త్తికేయభక్తు లయినమాట సత్యమేకాని యాయుద్ధమల్లునికులమే కార్త్తికేయుని నిలవేల్పుగాఁ గలిగియున్నదని తెల్పక చేఁబ్రోలునందలికుమారస్వామి బెజవాడలో వెలయఁగా నాతని కీయుద్ధమల్లుఁడు భక్తుఁడై గుడికట్టించిన ట్లున్నది. దీనింబట్టి యీశాసనమందలియుద్ధమల్లుఁడు క్రొత్తగాఁ గార్త్తికేయునకు భక్తుఁడైనట్లు కాన్పించుచున్నది గాని యనాదిగాఁ దమకులదైవత మైన యిలవేల్పునకు వంశపరంపరగా వచ్చినభక్తిచే గుడి కట్టించినట్లు లేదు. శాసనములోనివాక్యముల నీక్రింద నిచ్చుచున్నాను.

"పకఁగంగ బెజవాడఁ గొమరసామికి - భక్తుఁడైగుడియు
నిరుపమమతినృపధాముఁ డెత్తిచ్చె - నెగిదీర్చెమఠము
జననుతచేఁబ్రోలనుండి బెజవాడ - జాత్రకువచ్చి
త్రినయనునుతుఁ డొండుపోటు మెచ్చక - తివిరి యిన్నెలవ
యనఘుండు సేకొని యిందుఁ బ్రత్యక్ష - మైయున్న నిచ్చఁ
గని మల్లఁ డెత్తించె గుడియు మఠమును - గార్త్తికేయునకు."

దీనింబట్టి తమకులదైవత మగుకార్త్తికేయునకు భక్తితో నెత్తించినట్లు గాక చేఁబ్రోలనుండి యిచట వెలసి ప్రత్యక్షము కాఁగా నప్పుడు భక్తుఁడై గుడికట్టించినట్లు తేలుచున్నది.† కార్త్తికేయునకుఁ జాళుక్యులే కాని గుడికట్టింపఁ గూడ

---

* ఆంధ్రదేశమున వీరశైవము బసవేశ్వరునినాఁటనుండి బయలువెడలినది. ఈయంశము, ఆంధ్రులచరిత్ర మధ్యయుగముచూచినఁ దేలఁగలదు. ఈబసవేశ్వరుఁడు పండ్రెండవశతాబ్దమునాఁటి వాఁడు. ఈయంశము హిందూదేశకథాసంగ్రహములో హిందూమహాయుగముచూచినఁ దేలఁగలదు.

† శ్రీరామయ్యపంతులవారివాక్యములం గన నది స్పష్టము కాఁగలదు. వా రిట్లు లిఖించిరి. "కుమారస్వామి చేఁబ్రోలనుగ్రామమునుండి యొకానొకసమయమందు బెజవాడజాతర చూచుటకు వచ్చెననియు నాప్రకారము వచ్చినప్పు డెల్లచోట్లకంటె బెజవాడ యధికనివాసయోగ్యమని తోఁచి స్వామి యచ్చట నావిర్భవించె ననియు నిది తెలిసి యుద్ధమల్లుఁడు గుడియు మఠమును గట్టించె ననియు నాలవపద్యమునందు రెండవపద్యములోఁ జెప్పఁబడిన దానికే వివరణ

దనువిధి లేదు గదా. ఎవరు భక్తులై కట్టించినను గట్టింపవచ్చును. కానఁ గార్తికేయునకు గుడి కట్టించినంతమాత్రమున నితరలక్షణము లేవియును నక్కఱలేకయే యాగుడికట్టించినవానిని జాళుక్యునిగా నెన్నఁ బనిలేదు. అతఁడు నిజముగాఁ జాళుక్యుఁడే యైనయెడల యుద్ధమల్లుఁడు తమకులదైవత మైనకార్తికేయునకు గుడికట్టించె ననియె యుండును. ఈక్రిందియుదాహరణములంబట్టి చాళుక్యశాసనములలోఁ గార్తికేయునింగూర్చి వ్రాయువ్రాఁత యెట్లున్నదో చదువరులు గ్రహించుకొందురుగాక.

సర్వలోకాశ్రయునిశాసనములో—

"భగవత్స్వామిమహాసేనపాదభక్తానామ్."

శక్తివర్మశాసనములో—

"స్వామిమహాసేనపాదానుధ్యాతానామ్."

నందంపూడిశాసనములో—

"స్వామిమహాసేనపాదానుధ్యాతానామ్."

ఈరీతిగా శాసనములన్నిటను చళుక్యకులజు లెల్లరుఁ గుమారస్వామిభక్తులని చెప్పఁబడినది. యుద్ధమల్లశాసనమందలియాతఁడు చాళుక్యుఁడై యాదినుండియుఁ గుమారస్వామినిఁ గొల్చువాఁ డగుచో యుద్ధమల్లుఁడు తనకులదైవమగుకొమారసామికి భక్తితో గుడికట్టించె ననియే యుండును. శాసనములో నట్లు లేదు. చేఁబ్రోలునుండి బెజవాడలోనికి వచ్చి క్రొత్తగా వెలసియుండఁగా నాతనికి (క్రొత్తగా) భక్తుఁడై గుడికట్టించె నని యున్నది. నేను మొదటఁ జెప్పినట్లు కుమారస్వామికిఁ జాళుక్యుఁడేకాని యితరులు భక్తులు కాఁగూడదనియు గుడికట్టింపరాదనియు విధి లేదుగాన నింతమాత్రముచే నీరాజును జాళుక్యరాజన నవకాశము లేదు. చళుక్యుఁడేమో యనుసంశయమును గలిగించినఁ గలిగించుఁగాక.

శాసనమునఁ దెల్పఁబడినపురుషుల విచారంతము.

చళుక్యశబ్దము కాన్పింపనప్పుడు చళుక్యలలక్షణము లేవియు నిందు లేనప్పుడును శ్రీరామయ్యపంతులవారు దీనిని జాళుక్యశాసన మని యెట్లు

---

ముగాఁ జెప్పఁబడినది." (క్రిందిగీఁతను నేనుగీచితిని.) "ఇదితెలిసి" అనఁగాఁ గ్రొత్తగా బెజవాడలోఁ గార్తికేయుఁ డావిర్భవించినాఁ డని తెలిసి యప్పుడు భక్తుఁడై యని తేలుటలేదా? ఇది తెలిసినపిమ్మట భక్తుండైనాఁడన నంతకుఁబూర్వము కాఁడనుటయే కదా.

తెల్పిరందు లేని ఈ శాసనములో యుద్ధమల్లనామము కాన్పించుచుండుటచేతను బూర్వచాళుక్యులలో యుద్ధమల్లనామము లుండుటచేతను వారికిని దీనికిని శ్రీరామయ్యపంతులవారు ముడిఁ బెట్టిరే కాని యిం దున్న నామములంబట్టి చూచినను గూడ రాజనరేంద్రునిపూర్వులం దీసికొనినచో నిది పూర్వచాళుక్య శాసన మని చెప్పనలనుపడుట లేదు. ఏమన నిందు రెండుపేళ్లు కాన్పించుచు న్నవి. మల్లపరాజనునది యొకటి యుద్ధమల్లుఁడు (మల్లఁడు) అనునది యొ కటి. శాసనములోనివాక్యముల నీక్రింద నిచ్చుచున్నాను.

> "రమణతో బెజవాడ కెల్ల బెడఁగును - రక్షయుంగాను
> దమతాతమల్లపరాజువేరదు - దాను గట్టించెఁ
> గ్రమమునదానిక కలశమిడ్డట్లు - గామొగమాడు
> వమరంగ శ్రీయుద్ధమల్లుండెత్తించె - నమితతేజుండు."

దీనింబట్టి యిందుఁ జేర్కొనంబడిన యుద్ధమల్లునితాత మల్లపరాజని తేలు చున్నది. పూర్వచాళుక్యులలో రాజనరేంద్రునిపూర్వులలో మల్లపరా జెచ్చ టను గాన్పించుట లేదు. ఇది రాజనరేంద్రునకుఁ బూర్వము వ్రాయఁబడిన శాసన మగుచో నియ్యది చాళుక్యశాసనము కానేరదు. ఏమన నందు మల్లప రాజు లేఁడుకావున. ఈచిక్కును శ్రీరామయ్యపంతులువారుకూడ కనిపెట్టిరి. కాని దానివిడఁదీయుటలో మాత్రము మహాసాహస మొనరించిరి. యుద్ధమ ల్లునికే మల్లపరాజనుమఱియొకపేరు కల దనిరి! అట్లు సాహసించివ్రాయుటకుఁ గలప్రమాణముమాత్రము చూపలేదు. వారివాక్యరత్నముల నీక్రింద నిచ్చు చున్నాను.

"యుద్ధమల్లుఁ డనురాజు తనతాతమల్లపరాజు కట్టించినగుడికి గోపురము కట్టించె నని రెండవశాసనమునందుఁ జెప్పఁబడినది. మల్లపరాజనునది యుద్ధ మల్లునకు వాడుకపేరై యుండవచ్చును. ఈమల్లపరాజే కార్తికేయునకు గుడి కట్టించినయుద్ధమల్లుఁ డనియు, నాగుడికే యతనిమనుమఁ డగునింకొకయుద్ధమ ల్లుఁడు గోపురము కట్టించె ననియు నూహించుట యసమంజసముకాదు."

ఇవి శ్రీరామయ్యపంతులవారివాక్యములు. యుద్ధమల్లునకే మల్లపరా జనువాడుకపే రున్నదని మన మూహించుట కేమైన నాధారము లుండనక్కఱ లేదా? మన కేరీతి నుండిన బాగుగానుండు ననితోఁచిన నారీతి నూహించి తీరవలసినదియా? యుద్ధమల్లునకు మల్లపరా జనువాడుకపే రున్నట్లు కాని

యట్లు కాకున్నఁ గొన్నితావుల యుద్ధమల్లుఁడనియు మఱికొన్నితావుల మల్లపరా జనియుఁగాని యింకెక్కడనైన వ్రాయఁబడియుండెనా? ఎచ్చటను గాన్పించుట లేదు. ఇదివఱకు లభించినశాసనము లన్నియు యుద్ధమల్లశబ్దమునుగూర్చియే ముచ్చటించుచున్నవి గాని మల్లపరా జనుప్రయోగ మెచ్చటను గానరాదు. కావున యుద్ధమల్లునకే మల్లపరా జనువాఁడుక పేరు గలదని మన మూహించుట మహాసాహస మగును. నిరాధారముగా యుద్ధమల్లునకే మల్లపరా జనువాఁడుక పేరు కలదనుట సమంజసము కాదు.

ఈశాసనమందలి యుద్ధమల్లు డెవ్వఁడు?

శ్రీరామయ్యపంతులవారు కార్తికేయునకు గుడికట్టించినయుద్ధమల్లుఁడు వేఱును దానికి గోపురమునో ముఖమంటపమునో కట్టించినయుద్ధమల్లుఁడు వేఱును నై యున్నారనియు నిందుఁ జెప్పఁబడినవా రిద్ద ఱనియుఁ దలంచుచున్నారు. అది సరిగాఁ గాన్పించుట లేదు. ఏమన రమణతోఁ దనుపద్యమున నున్న "తమతాతమల్లపరాజు వేరడు దాను గట్టించె" నని దమతాతతాను గట్టించె నని శ్రీరామయ్యపంతులవా రర్థము చేసికొని యీయర్థమును జెప్పిరి. వారివాక్యముల నీక్రింద నిచ్చుచున్నాను.

తాను—(౧౦-౪౦) మల్లపరాజు తానుగట్టించె ననఁగా మల్లపరాజు కట్టించె ననియే యర్థము. తానుశబ్దమున కిట్టిప్రయోగము ప్రాచీనగ్రంథములందుఁ గనఁబడుచున్నది. పూర్వకాలమునం దాంగ్లేయభాషలో The king came అనుటకు మాఱుగా The king he came అనుచుండెడివారు."

శ్రీరామయ్యపంతులవారు చెప్పినట్లుగా మల్లపరాజు తాను గట్టించె నని యుండిన మల్లపరాజు కట్టించెనని యర్థము చేసికొందుముగాక. ఇం దట్లు లేదు. తమతాత మల్లపరాజు వేరడు తానుగట్టించె నని యున్నది. మల్లపరాజునకును తానునకును నడుమ "వేరడు" అనుపద మున్నది. దీని కర్థ మేమి? ఇది యేదియో తెలియకయే యీవాక్యమె ట్లర్థము కాఁగలదు. నడుమనున్న "వేరడు" విడచి శ్రీరామయ్యపంతులవా రెట్లర్థము చేసిరో తెలియవచ్చుట లేదు. తమతాత మల్లపరాజు వేరడు అనఁగాఁ దమతాతమల్లపరాజు పేరిటి అనియర్థమని తోఁచెడిని. యుద్ధమల్లుఁడు తమతాతమల్లపరాజుపేరిట గుడి కట్టించి దానిముఖమంటపమునుగూడఁ గట్టించెనని యీశాసనభావ మైనట్లు తోఁచుచున్నది. ఆంధ్రభాషయందలివాక్యాన్వయము తెల్పుటకై పూర్ణభాషావాక్యాన్వయమును దెచ్చుటలో విశేషము లేదు.

ఈశాసన మొకటియా యనేకములా?

ఈయర్థము సరియైన దగునా కాదా యని విచారించుటకును, నీం దిర్దటియుద్ధమల్లులు కలరా యనువిషయమును జర్చించుటకునుగూడ నీశాసన మనునది యొకటియా, రెండా, మూఁడాయనునంశము మొదట నిర్ణయింపఁబడవలసియున్నది. ఏమన శ్రీరామయ్యపంతులవారు మొదటి ముప్పదియాఱుపంక్తులును నొకశాసన మనియుఁ దరువాతిపదిపంక్తులును నింకొక శాసన మనియుఁ దలఁచి విశేషార్థములు తీయుచున్నారు. ఇంకను శాసన విమర్శకాగ్రగణ్యు లగుశ్రీరావుసాహేబు కృష్ణశాస్త్రిగా రన్ననో ౨౧ పంక్తు లనఁగా మూఁడుపద్యములు మొదటివి యొకశాసన మనియు "జననుత" యనుపద్యముమొదలు ౩౬-వ పంక్తిలోని "బుగాగ"వఱకు మఱియొకశాసన మనియుఁ దలఁచుచున్నారు. అనఁగా శ్రీకృష్ణశాస్త్రిగారిమతమునుబట్టి యీ నలువదియాఱుపంక్తులును మూఁడుశాసనము లగుచున్నవి. కీర్తిశేషు లగు గురుజాడ అప్పారావుపంతులవారు మున్నగువారు దీనినంతను (౪౬ పంక్తులను) నొక్కటియే శాసన మనిరి. ఈక్షణమువఱ కిది యొకశాసనమో రెండో మూఁడో యూహింపఁబడలేదు.

బాగుగాఁ బరిశీలించిచూచిన శ్రీరామయ్యపంతులవారు తలఁచినట్లుగా నీశాసనము రెండును గాదు, శ్రీకృష్ణశాస్త్రిగారుభావించినట్లుగ మూఁడును గాదు. ఇదియంతయును నొక్కటియే శాసనము. చదువరు లీక్రిందియంశమును గమనింతురుగాక.

(1) ౪౬ పంక్తులలో నున్నదియునుగూడ మధ్యాక్కరయే. ఒక్కపద్యములోనే ౪౬ పంక్తులును గలవు. కాన నిది యొక్కటియే శాసనము.

ఇవి భిన్నకాలమునందుఁ బుట్టినభిన్నశాసనములే యగుచో నంతటను నొక్కటియేపద్య ముండుట యంతగా సంభవింపదు.

(2) అంతటను యతిస్థానము నాల్గింటిపైఁ గాన్పించుచున్నది. కాన నిది యొక్కటియే శాసనము.

(3) ఒక్కఱాతిమీఁద నొక్కపద్యములో నీ ౪౬ పంక్తులు నున్నవి. కాన నిది యొక్కటియే శాసనము.

(4) లిపియందు భేదము గాన్పించుట లేదు. కాన నిది యొక్కటియే శాసనము.

(5) ౭౬ పంక్తులలోను కూడ యుద్ధమల్లుఁ డనురాజు బెజవాడలోఁ గార్తికేయునకుఁ గట్టించినగుడినిగూర్చియే ముచ్చట కాన్పించుచున్నది. అది యొక్కవిధ మగుపద్యములో నొక్కజాతిపై నొక్కలిపిలో నొక్కవిషయముం గూర్చియే కాన్పించుచున్నది, గాన, నిదియంతయును నొక్కటియే శాసనము.

శ్రీరామయ్యపంతులవారు తలంచినట్లుగా మొదటిమూఁడుపద్యములం దున్నవిషయవివరణము కొంత నాల్గవపద్యమం దున్నది. అంతకంటెను నింక నొకవిశేషము ౫-వపద్యమునం దున్నది. అ దెట్లన: మొదట ౨౧ పంక్తులలోను యుద్ధమల్లుఁడు బెజవాడలోఁ గార్తికేయునకు గుడియు మఠముఁ గట్టించె నని యున్నది. పిమ్మట ౨౨ మొదలు ౩౬ వఱకును గలపంక్తులలోఁ జేఁబ్రోల నున్నకుమారస్వామి బెజవాడలో వెలసె ననియు నందుమూలముచే బెజవాడలోఁ గార్తికేయాలయము కట్టింపఁబడవలసివచ్చె నని యున్నది. అటుపిమ్మట ౩౭ మొదలు ౭౬ వఱకును గలపంక్తులలో నీయుద్ధమల్లుఁ డాలయమును దమతాత పేరిటఁ గట్టించిన ట్లింకకొంతవివరణ మున్నది.* ఈ ౭౬ పంక్తులశాసనభావ మీక్రిందిదై యున్నది.

చేఁబ్రోలునం దుండెడుకుమారస్వామి యచటనుండి లేచివచ్చి బెజవాడలో వెలసెను. ఆస్వామికి యుద్ధమల్లుఁ డనునతఁడు తనతాతపేరుపెట్టి గుడి కట్టించి మొగమాడువు గట్టించెను. ఇది శాసనాభిప్రాయము. ౭౬ పంక్తులును నొక్కటియే శాసనము. అట్లు కా దందురేని రమణతో ననుపద్యమునకు సమన్వయమును లేదు. అర్థమును లేదు. అ దెట్లన:

"రమణతో బెజవాడ కెల్ల బెడఁగును - రక్షయుంగాను
దమతాత మల్లపరాజు పేరను - దాను గట్టించె."

అనుదానితో వాక్యసమాప్తి యని కదా శ్రీరామయ్యపంతులవారు తలంచిరి. ఈకట్టించిన దేదో యిందుఁ జెప్పియుండలేదే. తమతాత బెజవాడలోఁ గట్టించినాఁడు అని యీరెండుపాదములందలిపదములును దెల్పుచున్నవి. ఆ కట్టించిన దేదో యాపద్యమునందే లేదు. ఇది వేఱుశాసనమే యగుచో నిట్లు విషయశూన్యముగా నుండునా?

---

* మొదటిభాగములో గుడి కట్టించుటనుగూర్చి యున్నది—మొదటి ౨౧ పంక్తులు.
రెండవభాగములో నాగుడి కట్టించుటకుఁ గారణ మున్నది—౨౨ మొదలు ౩౬ వఱకు.
మూఁడవభాగములో గుడి యెట్లు కట్టించెనో యావివరణ మున్నది—౩౭ మొదలు ౭౬ వఱకు.

"వేరఱు"అనఁగా, పేరిట అని వ్రాసితివి కదా. వకారమునకు శాసనములో వకార మెట్లు వచ్చిన దందురేని, యీశాసనములో "ప"కు వ వ్రాయుట కిదియే మొదలు కాదు. ౨౬-వపంక్తిలో ప్రత్యక్ష మనుటకు వ్రత్యక్ష మని వ్రాయఁబడియున్నది. "వకారము తప్పు" అని శ్రీరామయ్యపంతులవారే వ్రాయుంచియున్నారు. కాన వేరడు అనుదానిని పేరఱు అనిచదువుకొనవలెను. పేరిటియనిగాని పేరటయనికాని యుండవలసినది. తాతకు తత యనినట్లే వ్రాఁత తప్పై యుండవచ్చును. "వ్రత్యక్ష బయున్న"అని మూలములో నుండఁగా "ప్రత్యక్షమైయున్న"యని శ్రీరామయ్యపంతులవారే దిద్దిరి. అకార మున్న చోట నుకారము వా రెట్లు పెట్టిరో యట్లే అకారమున్నచోట నికారము మనము పెట్టినాము. శాసనములో స్వరములు కొన్నితావులఁ దప్పుగాఁ బడుట కలవని యందఱును సంగీకరింపక తప్పదుగదా.

మఱియును నిటీవల శ్రీకొమర్రాజు లక్ష్మణరావుగారును నీశాసనమును విమర్శించి "ఈవేరఱు"అనుదానిని పేరఱని వ్రాసిరి. "వ" కు "ప" వచ్చుట ధర్మమే యనిరి. వారివాక్యముల నీక్రింద నిచ్చుచున్నాను.

"యుద్ధమల్లునిశాసనమున ౩౯, ౪౦ పంక్తులను రామయ్యపంతులుగారు 'ద్దమతాత మల్లపరాజు వేరడు దానుంగట్టించె'అని చదివి యున్నారు. 'వేరడు' అనుశబ్దము సందేహముగ నున్నదనియు వ్రాసినారు. ఈ'వేరడు' అనుదానిని 'వేరఱు'అని చదువవలయు నని నాతాత్పర్యము. రామయ్యగారు "డ"అని చదివిన అక్షరము 'డు'కాదు, 'ఱు'కాదు. అక్షరగీతు స్పష్టముగఁ గానవచ్చుచున్నది. కాన నది "ఱు"అనుట స్పష్టము. కావున నీశబ్దము 'వేరఱు'అననేమి? మూలశబ్దము పేరఱు. ఇందలిపకారము వకారముగ మాఱినదని నాతాత్పర్యము. ౨౬-వ పంక్తిలో 'ప్రత్యక్ష'శబ్దము 'వ్రత్యక్షము'అని వ్రాయఁబడినది. అట్లె యిదియునని యెఱుంగునది. ఇఁక 'పేరఱు'అననేమి యని విచారింతము. ఇందు పేర్ + అఱు అనురెండుశబ్దములు కలవు. పేర్ అనఁగా పెద్ద, అఱు అనగా ధర్మము. పేర్ శబ్దమునకు పెద్ద అనునర్థము అఱవము, కన్నడము, తెలుఁగు అనుమూడుభాషలయందును గలదు. అఱు అనుశబ్దము తెనుఁగునఁ గానరాదు. మిగిలినరెండుభాషలలోను గలదు. కన్నడమున 'అఱు'అనురూపముననే కలదు. అఱవమున 'అఱ'అనురూపమున నున్నది. ఈమాటలకు నాయాభాషలలో ధర్మము, దానము అనియర్థము. కావున 'పేరఱు'అనఁగాఁ గొప్పధర్మము అని యర్థము చేయవలెను."

దీనింబట్టిచూడ నిచట "పాకుప" శాసనములోఁ బడిన పరుసూహాను లక్ష్మణరావుగారును నచ్చి రని తేలుచున్నది. ఇఁక నేను దలఁచినట్లుగా "పేరిడి" అనిచదువవలెనా? శ్రీలక్ష్మణరావుగారు చదివినట్లు "పేరెఱు" అని చదువవలెనా యనివిచారింపవలెను. శ్రీలక్ష్మణరావుగారు తలంచినట్లు "పేరెఱు" అనియే చదువుదము. వారు తలంచినట్లే దానికిఁ బెద్దధర్మ మని యర్థము చెప్పుకొందము. అట్లయిన వాక్యార్థ మేమి? "తమతాత మల్లపరాజు ధర్మము తాను గట్టించె"నన భావమేమి? "ఎఱు" శబ్దము ధర్మ మనునర్థముకలది తెలుఁగులో లేనప్పుడు దానిని తెలుంగుశాసనమునఁ గల దనుట యెట్లు? తమతాత మల్లపరాజుధర్మముగాఁ దాను గట్టించెనని యర్థము చేయుదురా? సంతోషమే. అట్లు చెప్పిన నేను జెప్పినభావమే వచ్చుచున్నది.

ఇంతయేల "రమణతో"నను దానిని బ్రత్యేకశాసన మనుచో నర్థశూన్యమై పోవుచున్నది గాన నలువదియాఱుపంక్తులును నొక్కటియే శాసన మని చెప్పుట యుచితము.

వేఱుశాసనము కాకున్న ౩౬-వ పంక్తిలో "బుగాగ" అనునక్షరముల తరువాత చోటు కలదుకదా, యచ్చటనుండి యేల యీపద్యమును వ్రాయలేదని శ్రీరామయ్యపంతులవారు శంకించిరి. శాసన మెందును బొందకుండ "నృపులకుడ" అని పూర్తియగుటకుఁ గారణమేమో చెప్పిన ముప్పదియాఱవ పంక్తితో ముప్పదియేడవపంక్తి కలువకపోవుటకుఁ గారణమును నేను దెల్పెదను. ఎడమప్రక్క నున్నపంక్తు లడుగునుండి పైకిఁ జెక్కఁబడుటకుఁ గలకారణమును శ్రీరామయ్యపంతులవారు చెప్పిన దీనికారణమును నేను జెప్పెదను. లేఖకుల యిచ్చ నిప్పుడు మన మేమి చెప్పఁగలము? అయినను నెడమప్రక్క నున్నపంక్తులు క్రిందనుండి మీఁదికిఁ గలవు కావునను కుడిప్రక్క వ్రాయుపంక్తులు పైనుండి క్రిందికి వచ్చును గావునను బద్యములో నొక్కమాటయుట్టు నెడమప్రక్క నుంచుటకంటెఁ బద్యమంతయును గుడిప్రక్క నుంచుట మంచిదని లేఖకుఁడు తలఁచె నేమో? కొన్నిపంక్తులు ఱాతికి మధ్యగా మాత్రము చెక్కఁబడి పొట్టిగానున్నవి. కొన్ని పొడవుగా నున్నవి. దాని కెవరు కారణము చెప్పఁగలరు. లేఖకుఁడు స్వేచ్ఛ ననుసరించినాఁ డనుటకంటె మంచిసమాధానము లేదు. అంతమాత్రముచేతఁ బెద్దసందేహములఁ బెట్టుకొన నవసరము లేదు.

కాన నిదియంతయును (౪౬ పంక్తులును) నొక్కటియే శాసనము. ఒక యర్థమల్లునిగూర్చి మాత్రమే చెప్పుచున్నది.

శాసన మొక్కటి కాకుండినఁ బద్య మొకటి యగుట కానేరదని వ్రాసి యున్నాను. రమణతో ననునది మొదలు వేఱుకాలమున ననఁగా మనుమనికాలమున వ్రాయఁబడిన దనుకొందము. శాసనమును వ్రాయింపఁదలఁచి శాసనము వ్రాయఁ గవితోఁ జెప్పినప్పుడు కవి శాసనమును వ్రాయునుగాని దానిని లేఖకుఁ డేఱాతిపైఁ జెక్కునో యాఱాతినిజూచి యందు నిదివఱ కున్న శాసనము లేపద్యమున నున్నవో చూచి యాపద్యమునఁ దనశాసనమును వ్రాయునా? అట్లే వ్రాయు నందురేని యుద్ధమల్లశాసనము గలఱాతిమీఁదనే కదా మఱిరెండు శాసనములు కలవు. అవికూడ మధ్యాక్కరలో వ్రాయఁబడకుండుటకుఁ గారణ మేమి? కావున నేఁబదేండ్లకు ముందు వ్రాయఁబడినశాసనమునం దేపద్య మున్నదో చూచి యాపద్యముననే యేఁబదేండ్లతరువాతికవియును శాసనము వ్రాసె ననుట యంతగాఁ బొసంగియుండదు. అట్లు చూచియే వ్రాసె నందురేనిఁ బైశాసనమును జూచికదా కవి "రమణతో" నను శాసనమును వ్రాసినాఁడు. ఆశాసనమునం దున్నపురుషుఁ డెవరో చూచినాఁడుకదా. అట్టివాఁ డాశాసనమునందలిపురుషు నుద్దేశించి వ్రాయుచో నందుఁ జెప్పఁబడినరీతిగా నాతనిని యుద్ధమల్లుఁ డనక చదువరులకు భ్రాంతి కలుగులాగునఁ దాను క్రొత్తగా మల్లపరాజని వాడియుండునా? మఱియును లిపి యేఁబదేండ్లలోపుననే మాఱు ననికదా శ్రీరామయ్యపంతులవా రిప్పుడు వాదించుచున్నారు. ఇప్పుడు వాదించుచున్నారన నేలయన: నీవాదము వచ్చుటకుఁ బూర్వము నందంపూడిశాసనముంగూర్చి ముచ్చటించుచు లిపి యేఁబదేండ్లలో మాఱదని సిద్ధాంతముగాఁ జెప్పిరి. ఇప్పుడు తమసిద్ధాంతమును దామే యకారణముగాఁ ద్రోసివేసికొనిరి. ప్రబలనిదర్శన ముండినఁ బ్రతివివేకియును గూడఁ దనతొల్లింటియూహల మార్చుకొనవలసినదే కాని యిచట నట్టిపృథమైన బుజు వేదియును లేదు. అట్టిస్థితిలోఁ దాత యగుయుద్ధమల్లునికాలములోనిశాసనలిపికంటె మనుమఁ డగుయుద్ధమల్లునికాలమునందలిశాసనలిపి భిన్నముగా నుండవలెఁ గదా. భిన్నకాలములందుఁ బుట్టినరెండుశాసనము లని శ్రీరామయ్యపంతులవారు వాదించుచున్నయీశాసనములో లిపిభేదము కాన్పించుట లేదుగాన నిది యొకటియే శాసనము కాక తప్పదు. ఏవిధమునఁ జూచినను "రమణతో" ననుపద్యము వేఱుశాసన మనుట కవకాశము చిక్కుటలేదు.

శ్రీరామయ్యపంతులవారివాదము నిస్సారముగాఁ గాన్పించుచున్నదిగాన నీ ౨౬ పంక్తులశాసనమునందును మల్లపరాజు మనుమఁడైనయుద్ధమల్లుఁడు వర్ణిం

పఁబడినాఁ డని తేలుచున్నది. ఇది నిస్సంశయపక్షము. మల్లపరాజనుమఁడైనయుద్ధమల్లుఁడు రాజనరేంద్రునకుఁ బూర్వ మెచ్చటను గానరాఁడు. కాఁబట్టి శాసనమునందలిపురుషులనుబట్టి చూచినను నియ్యది పూర్వచాళుక్య శాసనముగాఁ గాన్పించుట లేదు. ఇందలిపురుషులు నీ రని నిర్ధారణముగాఁ దేలుట లేదు. పురుషులపేళ్లను నిర్ధారణము చేయుటలోఁగూడ శ్రీరామయ్య పంతులవారు తమసాహసమునే యాధారముగాఁ గొని యుద్ధమల్లునకే మల్లపరాజనువాడుకపే రుండవచ్చు నని నిరాధారముగా నుడివియుండిరి.

శ్రీరామయ్యపంతులవారు చెప్పినట్లుగా గుడికట్టించిన యుద్ధమల్లుఁడు వేఱును మొగమాడువుకట్టించినయుద్ధమల్లుఁడు వేఱును నగుచో నాయుద్ధమల్లు లిద్దఱును దాతయు మనుమఁడు నగుచో గుడికట్టించినయుద్ధమల్లుఁడు తాఁషరాజుతండ్రి యగుయుద్ధమల్లుఁడు కావలసినచ్చును. అతఁ డైన నతఁడు రాజ్యాదికమును జేసినవాఁడు కాఁడు. శాసనమునందలియుద్ధమల్లుఁడు రాజుగాఁ దెల్పఁబడి యున్నాఁడు. ఇది యెట్లు పొసఁగును? ఈశంకఁ జేసికొని శ్రీరామయ్యపంతులవా రిట్లు సమాధానము వ్రాసిరి.

"కాని యిది యొకయాక్షేపము గాదు. ప్రథమయుద్ధమల్లుఁడు వేరుసకు రాజు కాకపోయినను, అన్న యగుగుణగవిజయాదిత్యునితో సమానముగ రాజ్యభారమునహించిన ట్లగపడుచున్నది. కావున నొకానొకశాసనములో గుణగవిజయాదిత్యుఁడు తమ్మునితోఁగూడి ప్రజాపరిపాలనము చేసినట్లు వ్రాయఁబడియున్నది.* ఈహేతువుచేతనే ప్రస్తుతశాసనమున నీయుద్ధమల్లుని వర్ణించుటలో రాజవిశేషణములు కవి ప్రయోగించియుండును."

ఇది యాపాతరమణీయ మగువ్రాఁత. గుణగవిజయాదిత్యుఁడు 9-వ శతాబ్దమునఁ బరిపాలించినవాఁడు. శక్తివర్మ పదునొకండవశతాబ్దమున నున్నవాఁడు. రెండుశతాబ్దములు దాఁటినకాలమున శక్తివర్మ వ్రాయించినశాసనములో నేమో గుణగవిజయాదిత్యుఁడు తమ్మునితోఁగూడి పరిపాలించిన ట్లున్నదఁట. అందుమూలముచే నీయుద్ధమల్లుఁడు గుణగవిజయాదిత్యునితో సమానముగా భూభారమును వహించినట్లు శ్రీరామయ్యపంతులవారు దలంతురంట. క్రీ. శ. 945 లోఁ బుట్టినశాసనములో గుణగవిజయాదిత్యునిగూర్చి చెప్పినప్పు డాతఁడు తమ్ములతోఁ గూడి పరిపాలించినట్లు చెప్పలేదు. బర్నెలు దొరవారిగ్రంథము నుండి యందలివాక్యముల నీక్రింద నిచ్చుచున్నాను.

---

* మా. శక్తివర్మపథుబల్లుశాసనము. ఆ. సా. ప. పత్రిక సం. ౨.

"తత్సుతో గుణగాంకవిజయాదిత్య శ్చతుశ్చత్వారింశతం తదనుజయువరాజవిక్రమాదిత్యభూపతే స్సూనుః చళుక్యభీమభూపాలః త్రింశతమ్."

ప్రాచీనశాసనములలో లేక యిటీవలిశాసనములలో నున్నదానిని వివాదము వచ్చినప్పుడు ప్రమాణముగాఁ దీసికొనరాదు కదా. అయినను శక్తివర్మశాసనములోఁ దమ్మునితోఁగూడి యనుటకుఁ గలకారణము నూహింపవచ్చును. గుణగవిజయాదిత్యుని జ్యేష్ఠభ్రాత యగువిక్రమాదిత్యుఁ డప్పుడు యువరాజుగా నున్నట్లు పైశాసనమువలనఁ గాన్పించుచున్నదిగాన నతని నుద్దేశించి శక్తివర్మ శాసనములో నట్లు చెప్పఁబడెనే కాని తమ్ములుకూడ గుణగవిజయాదిత్యునితో సమానముగాఁ బరిపాలించుటచేతఁ గాదని చెప్పుకొనవచ్చును. 'భ్రాతృభిస్సహ' యనిబహువచన మేల యున్నదందు రేని ఇచటబహువచనమంద ఱికిని బాధకముగానే యున్నది. ఇంతయేల శ్రీరామయ్యపంతులవారు ప్రమాణముగాఁ జూపినశక్తివర్మశాసనములో నే మున్నదో ముందు కనుఁగొనుఁడు.

"స శ్రీమాన్ విజయాదిత్యభూపతి ర్భ్రాతృభి స్సహ
చత్వారింశత్సమాస్సార్ధం చతుర్భి రభున గ్భువమ్."

ఇది శాసనమునం దున్నవాక్యము. ఇందులో శ్రీమాన్ సవిజయాదిత్యభూపతిః భ్రాతృభిస్సహ భువమభునక్" అనియుండుటచే "భ్రాతృభిస్సహ" యనుదానింబట్టి శ్రీరామయ్యపంతులవారు గుణగవిజయాదిత్యునితమ్ములుకూడ నాతనితో సమానముగా రాజ్యభారము వహించినట్లూహింతురంట! ఇది యూపాతమధురముకాదా? తాము పట్టినపట్టు నెట్లయిన నెగ్గించుకొనవలయు నని శ్రీరామయ్యపంతులవా రిట్టియాపాతమధురము లగుయుక్తుల వ్రాయ మొదలుపెట్టిరి. తమ్ములతోఁగూడి (భ్రాతృభిస్సహ) భూమి నేలెను, అనినఁ దమ్ములుకూడ సమానముగా భూమి నేలి రని యర్థమగునా? ఇది వింతకాదా?* అట్లేయగుచో రామాయణమునందలి యుద్ధకాండములో

"శ్లో. దశవర్షసహస్రాణి దశవర్షశతానిచ
భ్రాతృభిస్సహిత శ్శ్రీమాన్ రామోరాజ్య మకారయత్."

అని యున్నది. "భ్రాతృభిస్సహితశ్శ్రీమాన్ రామోరాజ్యమకారయత్" అని యుండుటచేత రామునితో సమానముగాఁ దమ్ములుకూడ రాజ్య మేలి రని

* సహార్థమునిచ్చు సమశబ్ద మొకటి కలదు. అని గని శ్రీరామయ్యపంతులవారు భ్రమసిరేమో, సహార్థము నిచ్చుసమశబ్దమునకుఁ "గూడ" యని యర్థముగాని సమానమనునర్థము లేదు.

శ్రీరామయ్యపంతులవారు తలంతురా? అట్లు తలంతుమం మనేని బాలకాండ ములో నిట్లున్నది.

"శ్లో. ఈదృశై స్తై రమాత్యైస్తు రాజా దశరథోఽనఘః
ఉపపన్నో గుణోపేతై రన్వశాస ద్వసుంధరామ్."

దీనింబట్టి దశరథునితోఁ గూడ సమానముగా మంత్రులు రాజ్యము చేసిరని శ్రీరామయ్యపంతులవారు తలంతురా? సహయుక్తే ప్రధానే అను వ్యాకరణసూత్రముచే నిట గుణగవిజయాదిత్యభూపతిశబ్దము లప్రధాన మగు చున్నాయుగదా! గుణగవిజయాదిత్యునికి సమీపకాలమునఁ బుట్టిన శాసనముల లో లేకున్నను దూరపుశాసనములలో నున్న వాక్యములను గొన్నింటిని బుచ్చు కొని వానికి విపరీతార్థమును జేసి వానియందైన నెచటను లేనిభావమును "సమానముగా రాజ్యభారమును వహించు" ననగు వానిని జెప్పుటచే శ్రీరా మయ్యపంతులవారు పక్షపాతమును వహించి తమయిష్టము నగ్గించుకొన నెట్టికల్ప నముల నైనఁ జేయుచున్నారని యూహింపవలసియున్నది. పరిపాలన మున్నట్లు లేని యుద్ధమల్లునకుఁ (తాడరాజుతండ్రికి) బరిపాలన మంటఁగట్ట విపరీతప్రయత్న ములు చేయుట వింతకాదా? ఇది విపరీతప్రయత్నమనెడుసంగతి శ్రీరామయ్య పంతులవారికిఁ దెలియకపోలేదు. తమనామము లోకమును దృష్టింపఁజాల దని వారెఱుంగుదురు. కావుననే తాడరాజుతండ్రి యగు మొదటియుద్ధమల్లుఁ డు కాక యాతనిమనుమఁ డగుయుద్ధమల్లుఁ డైనను గావచ్చు నని వెంటనే యిట్లు వ్రాసిరి.

"రెండవయుద్ధమల్లుఁడే గుడికట్టించినవాఁ డనియు, గోపురము కట్టించి నది యాతనిమనుమఁ డగుమఱియొకయుద్ధమల్లుఁ డయియుండవచ్చు ననియు నూహించిన నూహింపవచ్చును."

అన్నియును నూహలే. ఆయూహ లైనను నేదియైన పని కావచ్చును. కంటిరా, చదువరులారా, ఎంతప్రబలసాక్ష్యమును శ్రీరామయ్యపంతులవారు తీసికొనివచ్చుచున్నారో; ఇంక నొకవిశేషమును శ్రీరామయ్యపంతులవారు లోకమునకుఁ జూప సాహసించుచున్నారు. అది యేదియన రెండవయుద్ధమల్లుఁ డని యూహించినను నూహింపవచ్చు ననినప్పుడు మొదటియుద్ధమల్లుఁ డనుకొన నేల యని మనసున శంకించుకొని యీక్రిందివాక్యరత్నమును వ్రాసిరి.

"గాని, రెండవయుద్ధమల్లునకు యుద్ధమల్లుఁ డనుపౌత్రుఁ డున్నట్లు మనకుఁ దెలియదు గావున మొదటిశాసనము ప్రథమయుద్ధమల్లునికాలమునం దును బుట్టియుండు ననుటయే సిద్ధాంతముగాఁ గనఁబడుచున్నది."

ఇది శ్రీరామయ్యపంతులవారు తేల్చినసిద్ధాంతము ఈ సిద్ధాంత మెంత ఘనమైనది? రెండవయుద్ధమల్లునకు యుద్ధమల్లుఁ డనుమనుమఁ డుండిన, నిది నిలువదఁట. నిలువనిదాని నెట్లు నిలువఁబెట్టిరి? రెండవయుద్ధమల్లునకు యుద్ధమల్లుఁ డనుమనుమఁ డున్నాఁడనుసంగతి మనకుఁ దెలియదు గాన శ్రీరామయ్యపంతులవారివాదము సిద్ధాంతమైనది. ఈసిద్ధాంతమునకుఁ గారణ మేమి? మన తెలియమి! ఇది వింతవాదము కాదా? మనకుఁ దెలియనియంశములఁగూర్చి వ్రాయుటలో మనకుఁ దోఁచినసిద్ధాంతములనే చేయవచ్చును గాఁబోలు! యుద్ధమల్లునకు యుద్ధమల్లుఁడను మనుమఁడుండుట యసంభవముకాదుగదా. అది యసంభవమైనను మఱియును బ్రస్తుత యుద్ధమల్లునకు యుద్ధమల్లుఁడను మనుమఁడు లేఁడని సాధిగాఁ దెలియవచ్చినను శ్రీరామయ్యపంతులవారి యూహ సిద్ధాంతము కాఁగలదు గాని యున్నదియును లేనిదియును నేఁడున్న మనకుఁ దెలియనంతమాత్రమున శ్రీరామయ్యపంతులవారి యూహ సిద్ధాంతమే యైపోవునా? ఇది వింతసిద్ధాంతము కాదా!

అదిగాక యీశాసనమునం దిద్దఱు యుద్ధమల్లులు పేర్కొనఁబడి రని తలంచుటకూడ నసంగతమే. శ్రీరామయ్యపంతులవారు తలంచినట్లుగా 32-వ పంక్తి (రమణతో) మొదలు ౪౬ వఱకు నొకప్రత్యేకశాసనము కాదు. ఈ నలువదియాఱుపంక్తులయసంపూర్తిశాసనమున కర్థ మేమన:—

చేఁబ్రోలునందుండు కుమారస్వామి యచటినుండి బెజవాడకు వచ్చి మంచిచోటని యెంచి యందుఁ బ్రత్యక్షముగాఁగ మల్లపరాజుమనుమఁ డగుయుద్ధమల్లుఁ డనురాజు వానికి భక్తుఁడై బెజవాడలోఁ దమతాతపేరుపెట్టి (తమతాత ధర్మముగా) గుడియును, మొగమాడువును, మఠమును గట్టించె. శైవులు కానివారలు మఠములో బసచేయరాదు అనునది యీశాసనోద్దేశము.

కాన నిది యొక్కటియే శాసనము. ఇందుఁ బేర్కొనంబడినవాఁ డొక్కఁడే యుద్ధమల్లుఁడు. ఆతఁడు మల్లపరాజునువానిమనుమఁడు. కాన నీ మల్లపరాజుమనుమఁ డైనయుద్ధమల్లుఁ డెవ్వఁడో మనకుఁ దెలియరాలేదు. శ్రీరామయ్యపంతులువారుకూడ నాతఁడా యీతఁడా యనుసందేహములోఁ బడి యాచిక్కు తప్పించుకొనఁజాలక మనకు బాగుగాఁ దెలిసినవా రెవరో వారే యిందుఁ బేర్కొనఁబడినవా రందమని సాహసించి పలికిరి. అట్లేల పలుకరాదో దానిసంతను నేను ఋజువుచేసియే యున్నాను. ఇది చళుక్యశాసన మనుటకే వలనుపడదు. కాఁబట్టి యీశాసన మేవంశస్థులు వ్రాయించిరో కానరాదు.

వారినామము లేవో బోధపడుటలేదు. కాల మంతకుఁ బూర్వమే తెలియవచ్చుటలేదు.

మల్లపరాజు—మల్లఁడు.

చాళుక్యసంతతము లనేకములు కలవు. వానిలో నెవ్వరికిని నీశాసనమునందుఁ జెప్పఁబడినరాజులనామములు లేవా యందురేని కలవు. శ్రీరామయ్య పంతులవా రన్వయించినరీతిగాఁ జూచిన లేదుకాని న్యాయముగా యుద్ధమల్ల శాసనమునందుఁ జేర్కొనఁబడిన యుద్ధమల్లుఁ డొక్కఁడే యనియు నాతఁడు మల్లపరాజు నునామకుఁ డనియు నెంచుచో నొకానొకచళుక్యశాఖలో నట్టివా రిద్దఱు కాన్పించుచున్నారు. వారినిఁ గూర్చి వ్రాయుటకుముందు శాసనమునందుఁ జెప్పఁబడినవా రెవరో విచారింతము.

యుద్ధమల్లునిఁగూర్చి.

ఈశాసనమునందుఁ జెప్పఁబడినవారు యుద్ధమల్లుఁడును మల్లపరాజును నైయుండిరి. యుద్ధమల్లునకే మల్లఁ డనువాడుకకూడఁ గలదు. యుద్ధమల్లునకే మల్లపరాజనునది వాడుకపేరై యుండు నన్నట్లా యందురేని అట్లుకాదు. ఈశాసనమునందే యుద్ధమల్లుఁడనియు మల్లఁడనియుఁగూడ వాడఁబడియున్నది. చూడుఁడు.

౧ స్వస్తినృపాంకుశాత్యన్తపత్స
౨ లసత్యత్రినేత్ర, విస్తర శ్రీయుద్ధ
3 మల్లుణ్డు.

అను పంక్తులలో యుద్ధమల్లుఁడని వ్రాయఁబడియున్నది.

౨౫ యనఘు
౨౬ ణ్డునేకొని యిన్దువ్రత్యక్ష
౨౭ బయన్నునిచ్చెఁగని మల్లణ్డె
౨౮ త్రించె గుడియు మఠము"

అని ౨౭,౨౮ పంక్తులలో నాతఁడే మల్లఁ డని వాడఁబడియెను. కాన యుద్ధమల్లునకె మల్లఁ డనువాడుకపే రున్నట్లీశాసనమువలననే తెలియవచ్చుచున్నది.

మల్లపరాజుఁగూర్చి.

మల్లఁ డనుమాఱుపేఱు గలయీయుద్ధమల్లునితాత మల్లపరా జని యీ శాసనమునందే కాన్పించుచున్నది కనుఁడు.

౩౭ రమణతో బెజవాడకెల్ల

౩౮ బెసంగును రక్షయుంగాను

౩౯ స్థమతతమల్లపరాజువే

౪౦ రముదానుంగట్టించె

అనుపంక్తులనుబట్టి యీ (యుద్ధ)మల్లనితాత మల్లపరా జని తెలియ వచ్చుచున్నది. కాఁబట్టి మల్లపరా జనుతాతయును యుద్ధమల్లఁ డనుమనుమఁడును జాళుక్యులలో నెచ్చటనైనఁ గాన్పించిన వారే వీ రనుకొనవచ్చును. అట్లు కాకున్న మల్లపరా జనుతాతయును మల్లఁ డనుమనుమఁడును గాన్పించినను సరే. ఏమన మనశాసనమునందే మల్లఁ డనుపేరుకూడఁ గాన్పించుచున్నదిగదా. పరికించిచూడ సరిగా మల్లపరాజుమనుమఁ డైనమల్లఁడు మనకుఁ జాళుక్యులలోనే కాన్పించుచున్నాఁడు. శాసనమునందే నామము లెట్లు వాడఁబడినవో యట్లే యున్నవి. భేద మేదియును లేదు. కనుఁడు. ఒకప్రాచీనవిలేఖనమును ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున నున్నదానిని దీసి బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు చాలకాలముక్రిందనే ప్రచురించియున్నారు. దానిని నేను శ్రీసుదాన్యపతబోధినిలో నేడవసంపుటములో ౧౧, ౧౨ సంచికలు గలదానిలోఁ (నవంబరు ౩౦, డిసెంబరు ౩౧ తేదీ, ౧౯౧౧ గలవానిలో) బ్రకటించియున్నాను. దానిని మరల నిం దిచ్చుచున్నాను. (వలయుభాగము మాత్రమే.)

“త॥ దానభూపతికొమారుడు శక్తికీర్తివర్మ యీవేంగిదేశమును ౧౨ సం॥ రాజ్యము చేసెను.

ఇతనితమ్ముఁడు విమలాదిత్య మహారాజు ౭ సం॥ రాజ్యం యేలెను. ఇతని కుమారుఁడు రాజరాజు అనగా రాజరాజనరేంద్రుఁడు ౪౦ సం॥ రాజమహేంద్రవరం పట్టంగట్టికొని యేలెను. ఇతనిభార్య గంగమాంబాదేవియందు రాజేంద్రచోళమహారాజు పుట్టెను.

ఇతని కొ॥ విక్రమచోళుడు.

తర్వాత అమ్మభూపాలుడు ఇతని కొ॥ ఖేతరాజు. ఇతని కొ॥ సత్యాశ్రయుడు. ఇతనిభార్య గంగమ.

వీరికొమాళ్లు.

౧. త్రయీవీరుడు, ౨. విజయాదిత్య, ౩. విమలాదిత్య, ౪. విక్రమాదిత్య, ౫. విష్ణువర్థన, ౬. త్రిలోకమల్ల, ౭. కామరాజమార్తాండ. వీరిలో

౨ విజయాదిత్యునిభార్య విజయమహాదేవి. కుమారుడు విష్ణువర్ధనుడు. ఇతని కుమారుడు మల్లపరాజు.* ఇతనిభార్య చందలదేవి. ఇతని కొ॥ విజయాదిత్యుడు. ఇతనిభార్య గంగాదేవి.

ఇతని కొ॥ మల్లభూపాలుడు.* ఇతని శకం ౧౧౨౪.

ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారములో చారిత్రకసంపుటములలో ౧౫-౬-౨౨ అనుసంఖ్యగలసంపుటము ౩౮, ౩౯, ౪౦ పుటల కిది ప్రతిక. మాతృకలో నీఁగ వచ్చియుండిన నిందును నీఁగ పెట్టఁబడినది.

దీనింబట్టి శ్రీరామయ్యపంతులువారు కోరిన (సల్కి?) చాళుక్యవంశములో మల్లపరాజును నాతని మనుమఁ డగుమల్లఁడును† దొరకిరి. ఈమల్లఁడు పదుమూఁడవశతాబ్దమునాఁటివాఁడు. ఈతఁడే బెజవాడలోఁ గార్తికేయునకు గుడి యును మొగమాడపును మఠమును దనతాతమల్లపరాజుపేరను గట్టించినవాఁడై యుండవచ్చును. సరిగా నామములు యుద్ధమల్లశాసనములో నెట్లున్నవో యట్లేయున్నవి. శాసనస్థపురుషులంబట్టి శాసనకాలాదికమును దెలిసికొన సత్యరతులు ప్రయత్నించుచో వీరికాలమునుబట్టి శాసనకాలము తేలుచున్నది. ఇందులో మల్లఁడు శాలివాహనశకము ౧౧౨౪ నాఁటివాఁ డని వ్రాయఁబడియున్నది. అనఁగాఁ గ్రీస్తుశకము ౧౨౦౨ అని తెలియవచ్చుచున్నది. దీనింబట్టి యీయుద్ధమల్లశాసనము ౧౩-వ శతాబ్దాదిని దిక్కనాదులకుముందు నన్నయకుఁ దరువాతను బుట్టినట్లు కాన్పించుచున్నది, మల్లపరాజుపే రున్నపిఠాపురపుశాసనమందలి లిపి యీలిపినిబోలి యుండలే దందురేని దానికి లేఖకాదిభేదము కారణము కావచ్చును.

సల్కిశబ్దము చళుక్యశబ్దభవమే యై యుద్ధమల్లశాసన మనఁబడునది చళుక్యశాసనమే యగుచో నీశాసనమునం దున్నపురుషులనామములంబట్టి యీశాసనము ౧౩-వ శతాబ్దములోని దగుచున్నది. ఇది కానిచో శాసనస్థమల్లపరాజమల్ల లెవరో తెలియవచ్చుట లేదు.

రాజసల్కిభూవల్లభులలోనే యుద్ధమల్లశాసనములోఁ జెప్పఁబడిన మల్లపరాజును నాతనిమనుమఁ డగుమల్లఁడును† గాన్పించుచుండఁగా శ్రీరామయ్యపంతులవారేల యంగీకరింపరో తెలియవచ్చుట లేదు.

---

* గీతలు నేను గీచితిని. † మల్లభూపాలుఁ డనినప్పుడు భూపాలశబ్దము ప్రభువని చెప్పు చిహ్నముగా నుండునే కాని పేరు కానేరదా. రాజరాజును రాజరాజనరేంద్రుఁడు రాజరాజనరపాలుఁడు నైనట్లే.

శ్రీరామయ్యపంతులవారు తమయూహ నీక్రిందివాక్యములలో విస్పష్టముగాఁ దెలిపియేయున్నారు.

“చాళుక్యవంశరాజులలో నొకశాఖవారు పిఠాపురప్రాంతమున రాజ్యము చేసినట్లును, వారిలో మల్లప యనుపేరుగలవార లిరువురు తాతయు మనుమఁడు నుండిరనియు రెండవమల్లప ౧౨౦౨-వ క్రైస్తవాబ్దము జూను నెల ౧౬-వ తేది నభిషిక్తుండయ్యెననియుఁ బిఠాపురము కుంతీమాధవస్వామియాలయములో నున్నయొక శాసనములో నున్నది. (2) ఈమల్లపలే ప్రస్తుతపుశాసనములోఁ జెప్పఁబడినమల్లపరాజును యుద్ధమల్లుఁడు నయియు నుండవచ్చునని కొందఱకుఁ దోఁపవచ్చును. కాని యీపిఠాపురశాసనలిపికిని బెజవాడశాసనలిపికిని భేద మధికముగా నున్నది. కావున రెండు నేకకాలమునందుఁ బుట్టియుండుట పొసఁగదు.”

దీనింబట్టి చూడ శాసనమున నే రాజులు వర్ణింపఁబడియుండిరో వారి కాలముంబట్టి కాక శాసనమునం దున్నవిశేషములనుబట్టి కాక లిపి నొక్కదానిని బట్టియే శాసనకాలమును నిర్ణయింప శ్రీరామయ్యపంతులవారు నిశ్చయించుకొనిరని తేఁలుచున్నది. ఇది పెద్ద వింత. యుద్ధమల్లశాసనము వ్రాసినవాఁడు పూర్వపుకత్తువ్రాయువాఁడును బిఠాపురపుశాసనము వ్రాసినవాఁడు క్రొత్తకత్తువ్రాయువాఁడును గాఁగూడదో.

పురుషులకాలముంబట్టి లిపికాలము నెంచవలయును గాదా.

పురుషులకాలమునుబట్టి లిపికాలమును నిర్ధారణము చేయవలసినదా లిపికాలమునుబట్టి పురుషులకాలము నేర్పాటు చేయవలసినదా? ఈకాలము మొదలీకాలమువఱకు నీవిధ మగులిపి కలదు. తరువాత నీకాలము మొదలీకాలమువఱకు నింకనొకవిధ మగులిపి కల దని యేదేని నిశ్చిత మైనపద్ధతి యొకటి లిపి కేర్పడినదా? లేదు. ఎంతకాలమునుండి యెంతకాలమువఱకుఁ బురాతనలిపియో మఱియు నెంతకాలమునుండి యెంతకాలమువఱకు మధ్యకాలపులిపియో యటుపిమ్మట నెంతకాలమునుండి యెంతకాలమువఱకు నధునాతనలిపియో తెలియవచ్చుట లేదు. యుద్ధమల్లాదిశాసనములందలిలిపి యేకాలమునఁ బ్రారంభమై యేకాలమున కాఁగిపోయినదో శ్రీరామయ్యపంతులవారు చెప్పఁగలరా? చెప్పఁజాలరు. కావుననే “దీనిని బూర్వపక్షము చేయఁజాలునాధారము లింకముందు లభించిన లభించుంగాక” యని శ్రీరామయ్యపంతులవారే తాము వ్రాసినది ముందుఁ బూర్వపక్షమైనఁ గావచ్చు ననిరి. ఎట్లు?

తాముశిలంచిన కాలముకంటెఁ బైఁగా యుద్ధమల్లశాసనమునం దున్న లిపివంటిలిపి కాన్పించినఁగదా. దీనింబట్టి శ్రీరామయ్యపంతులవారికి నేలిపి యెంతకాల మున్నదో బాగుగాఁ దెలియదని స్పష్ట మగుచున్నది. ఇంతయేల? ఆనిర్ణయ మెవరుచేయఁగలరు? ఎట్లుచేయఁగలరు? మఱియొకచోట శ్రీరామయ్యపంతులవారు "భాషవలెనే లిపియుఁ గాలక్రమమున మాఱినది. కనుక పూర్వశాసనకాలముల నిర్ణయించుట కాశాసనములలిపి యొకముఖ్యసాధన మగుచున్నది" అని వ్రాసిరి. అందుల కంగీకారమే కాని యామార్పెప్పుడు జరిగినదో నిర్ధారితమైన పిమ్మటనుగదా లిపినిబట్టి కాలనిర్ణయము చేయుట. తెలుఁగులోఁ గాలక్రమమునం గలిగినమార్పులంబట్టి యనేకవిధము లగులిపు లున్నమాట నిజము. కాని యేలిపి యెంతకాలమువఱకు నున్నదో యది నిశ్చయింపఁబడి యుండవలయును గదా. అట్టినిర్ధారణ మేదియైనఁ గలదా? లేదు. ఎప్పుడైనను శాసనమునందుఁ బేర్కొనంబడినపురుషులకాలమునుబట్టి కదా లిపికాల మేర్పడవలయును. రాజనరేంద్రునిశాసనములలో నీలిపి యుండిన నిది యప్పటివఱకుఁ గలదందుము. కులోత్తుంగచోళుని శాసనములలోఁ గూడ నీలిపి యుండిన నీయది యప్పటివఱకును గలదందుము. అంతియొకదా మనకాధారము. ఈయంశమును శ్రీరామయ్యపంతులవారివాక్యములే తేల్చుచున్నవి. కనుఁడు.

"రాజరాజుకాలమునందుఁగాని, దానిపిదప నేఁటివఱకుఁగాని పుట్టిన శాసనములలోఁ బూర్వలిపి యెక్కడను నాకుం గనఁబడలేదు" అని వ్రాసిరి. కనఁబడిన నేమికావలయును? తరువాతఁగూడ నీలిపి కల దని తేలునుగదా? ఇదియేకదా మన కున్నయాధారము? ఈలిపి గలశాసనము లెన్నియున్నవో వానికాలమేదో వీరికిఁ దెలిసినదా? లేదు. లే దనుట కొకయుదాహరణము నిచ్చెదను. నెల్లూరుమండలమునందలి నలజనాడుశాసనములో నీయక్షరములు (యుద్ధమల్లునిశాసనాక్షరములవంటివి) ఉన్నవని లిపిజ్ఞులు చెప్పుచున్నారు. ఈ శాసనకాలమేదో తెలియదు. ఇది రాజనరేంద్రునకుఁ బరమేమో. ఇప్పుడు మనము చాళుక్యమల్లపరాజుమనుమఁ డైనమల్లునికాలములో నీలిపి యున్నట్లుగా నీయుద్ధమల్లశాసనముచేఁ గనిపెట్టినాముకాఁబట్టి శ్రీరామయ్యపంతులవారు తమయసంగతసిద్ధాంతమును దిద్దుకొనవలసియుండును. అయినను నీయుద్ధమల్ల శాసనము వివాదములో నున్నదికాఁబట్టి దీనిని విడిచి శ్రీరామయ్యపంతుల వారు యుద్ధమల్లశాసనలిపి యెంతవఱకుఁగల దందురో దానిని గనుఁగొందము.

రాజరాజు కాలములోఁ బూర్వలిపి లేదనికదా శ్రీరామయ్యపంతులవారు లిఖించిరి. ఇఁక నెంతవఱ కున్నదనిరి. రాజరాజు పెదతండ్రి యగుశక్తివర్మకాలములో నీలిపి కలదని యంగీకరించిరి. వారివాక్యము లీక్రింద నిచ్చుచున్నాను.

"ఆంధ్ర దేశమందలిపూర్వశాసనములలిపిలో సామాన్యదృష్టికి రెండు రీతులు (కత్తులు) పొడకట్టుచున్నవి. అడ్డుకత్తొకటియు, గుండ్రకత్తొకటియు. మొదటిది రాజరాజు కాలమునకుఁ బూర్వము పుట్టినశాసనములలోఁ గనఁబడుచున్నది. రాజరాజునాఁ డీయక్షరములపోలిక యేహేతువుచేతనోగాని మాఱినది. . . . పూర్వోక్తపూర్వలిపినిఁబోలియున్నది." అని యుద్ధమల్లశాసనముంగూర్చి వ్రాసినదానిలో వ్రాసిరి.

దీనింబట్టి యుద్ధమల్లశాసనమునం దున్నలిపి రాజరాజు కాలమువఱకును వచ్చినదనియును నప్పటినుండియును లిపి మాఱిపోయినదనియును దెలియవచ్చుచున్నది. శక్తివర్మప్రభుబట్టుశాసనమునం దున్నలిపికూడ యుద్ధమల్లశాసనలిపి వంటిప్రాచీనలిపియే యని వీ రంగీకరించిరి. రాజరాజు పెదతండ్రివఱకు నీలిపి కలదఁట. ఒక్కరాజరాజునాఁడే హఠాత్తుగా నదివఱ కున్నలిపియంతయును మాఱిపోయి క్రొత్తకత్తు వచ్చినదంట! ఇది వింతకాదా! ఒకపురుషునికాలమున నదివఱకుఁ జిరకాలమునుండి వచ్చుచున్నలిపి యొక్కసారిగా మాఱిపోవునా? ఇది పెద్దవింత కాదా? లోకములో నిట్టిమార్పులు హఠాత్తుగాఁ గలుగుట యసంభవముకాదా? భాషవలెనే లిపి మాఱునని శ్రీరామయ్యపంతులవారు వ్రాయించిరికదా. భాష యొకపురుషునికాలములో మాఱిపోవునా? క్రమక్రమముగా మాఱి బహుకాలమునకుఁ గాని కామార్పు కాన్పించును. లిపియును హఠాత్తుగా నొక్కపురుషునికాలములో మాఱదు. ఈనీతి శ్రీరామయ్యపంతులవారే యంగీకరించి రాజరాజునందంపూడిశాసనముంగూర్చి వ్రాయునపు డీక్రిందిరీతిని నీలిని వెల్లడించియుండిరి.

"లిపి—శాసనలిపి మొదటినుండి మూఁడవపట్టము రెండవపుట యాఱవ పంక్తిలో 'శత్రూన' అనునక్షరములవఱ కొక్కరీతిగను పిదపఁ జివరవఱకు నొక్కరీతిగ నున్నది. దీనినిబట్టి కీల్హార్ను గారు రెండుభాగములు వేఱువేఱుకాలములందుఁ జెక్కఁబడియుండు నని యూహించినారు. ఈయూహ సరియె. కాని యీరెండుకాలములకు నంతర మంతయెక్కువగా నుండదని చెప్పవలసియున్నది. ఏలయనఁ బూర్వభాగములోనికథ శక్తివర్మరాజ్యపాలనారంభమువఱకు నున్నది. శక్తివర్మ పన్నెండుసంవత్సరములును విమలాదిత్యుఁడు యేడుసంవత్సరము

లును భూమినేలిరి. రెండవభాగము విమలాదిత్యునిపుత్త్రుఁడగు రాజరాజు రాజ్యకాలములో ముప్పదిరెండవయేఁటఁ బుట్టినది. కాన నీరెండుభాగములకు నంతర మేఁబదిసంవత్సరములకంటె నెక్కువ యుండదు. తక్కువనైన యుండిన నుండవచ్చును. *ఈపాటికాలములో లిపిస్వరూప మంతగా మాఱియుండదా యని సంశయింపవలసియున్నది, రెండుభాగములకుఁ గలలిపిభేదము కాలభేదముకంటె లేఖకభేదము ననుసరించి యధికముగాఁ గలిగియుండవచ్చునని నా యభిప్రాయము."

దీనినిబట్టి యేఁబదియేండ్లలో లిపిభేదము కలుగనేరదనియు నించుకభేదము కాన్పించిన నయ్యది కాలభేదమువఁగాక లేఖకభేదమునఁ గలిగియుండవచ్చుననియు శ్రీరామయ్యపంతులవారు తేల్చినసిద్ధాంతమని తెలియవచ్చుచున్నది. ఇట్లు మొదట వ్రాసినశ్రీరామయ్యపంతులవారింతలోనే మాఱిపోయి యుద్ధమల్లశాసనముంగూర్చి వ్రాయవలసివచ్చునప్పటికి లిపి యొకపురుషునికాలములోనే మాఱిపోవునని సిద్ధాంతీకరించిరి. ఏఁబదియేండ్లకాలములోనే లిపిమాఱదని నుడివినవా రొకవత్సరములోనే మాఱిపోవునని యిప్పుడు వ్రాయుచున్నారు. ఇది వింతకాదా! మొదట నొకవిధమగుసిద్ధాంతమును దేల్చి తరువాత నాసిద్ధాంతమునకే వ్యతిరేకముగా నాలుగైదేండ్లలోనే యెందుకు వ్రాసిరో తెలియకున్నది. మాఱ్పంతయును రాజనరేంద్రునికాలములోనే ప్రారంభమైనదంట. "రాజరాజునాఁడీయక్షరములపోలిక యేహేతువుచేతనోగాని మాఱినది" అని యుద్ధమల్లశాసనమునుగూర్చి వ్రాసినప్పుడు లిఖయించియుండిరి. మఱియును శక్తివర్మశాసనమునుగూర్చి వ్రాయునప్పుడు "లిపి నందంపూడిశాసనము పూర్వభాగపులిపిని బోలియున్నది. *ఆశాసనముచివరభాగములిపి రాజరాజుకాలమందే పుట్టినట్లు తోఁచుచున్నది. ఆలిపిని బోలినలిపి రాజరాజుకాలమునకుఁ బూర్వము పుట్టినశాసనములలో నింతవఱకుఁ గనఁబడలేదు" అని వ్రాసిరి. దీనింబట్టి క్రొత్తలిపి రాజరాజుకాలమునందే ప్రారంభమైనట్లు తెలియవచ్చుచున్నది. వచ్చుఁగాక. ప్రాఁతలిపి రాజరాజుకాలమునఁ బూర్తిగఁ బోయినదా? కొంతకాలమైన నిలువలేదా? శ్రీరామయ్యపంతులవారి వ్రాఁతవైఖరింగన రాజరాజు పట్టాభిషిక్తుఁడైననాఁడే క్రొత్తలిపి ప్రారంభమైన దనవలయు నని శ్రీరామయ్యపంతులవారి యూహ యని తోఁచు

* క్రిందిగీఁతలు నేను గీచినాఁడను.

చున్నది. ఇది వింతకాదా? బహుకాలమునుండి వచ్చుచు జనుల కంపఱికి నలవాటుగా నున్నకత్తు హఠాత్తుగా నొక్కనికాలమున మాఱి దేశమునందంతటను క్రొత్తకత్తు వచ్చునా? రాజనరేంద్రునినాఁడే క్రొత్తకత్తు ప్రారంభమైన నగుఁగాక. అంతమాత్రముచేతఁ బ్రాఁతకత్తు పూర్తిగాఁ బోదు. ఒకకొందఱు క్రొత్తకత్తు వ్రాయుచుండిన నింకఁ గొందఱు ప్రాఁతకత్తు వ్రాయుచుందురు. మఱికొందఱు రెండులిపులపోలికను గల లిపిని వ్రాయుచుందురు. ఇట్లు వ్రాయఁగా వ్రాయఁగా లోకమునకుఁ క్రొత్తలిపియే హెచ్చుగా రుచించుచు వచ్చినఁ క్రొత్తలిపి వ్యాప్తి నందును, బ్రాఁతలిపి నశించును. ఇది కొన్నివందలయేండ్లకుఁగాని గలుగనేరదు. ఈనడుమ కాలమునకు సంధికాలమని పేరు. యుగము మాఱి యుగము వచ్చుటకు సంధికాలమున్నట్లే లిపి మాఱి లిపి వచ్చుటకు నడుమ సంధికాల ముండును. సంధికాలములో రెండులిపులును నుండును. సంధికాలమునకు నింగ్లీషులో "ట్రాన్సిషనల్ పీరియడ్డు" (Transitional period) అని పేరు. ఈసంధికాలము క్రీస్తుశకము ౧౦౦౦ మొదలు ౧౩౦౦ వఱకును నడచిన దని బర్నెలుదొరవారు వ్రాసియున్నారు. ఒక్కసారిగా నెన్నఁడును దేశమునందంతటను మాఱ్పు పుట్టనేరదు. రాజాజ్ఞ యిచ్చినను బుట్టనేరదు. ఈకాలమునందలిలిపివైఖరిం గనుఁడు. ఇంగ్లీషుదొరతనము వచ్చి దానితోడిపాటుగా నచ్చువచ్చియుండుటచే నప్పుడు బర్నెలుదొరవారు చెప్పినట్లుగా మనలిపి విశేషముగా మాఱిపోయినది. అయినను నిప్పటికిని రెండువందలయేండ్లకుఁబూర్వము వ్రాయుచు వచ్చినకత్తుకూడ నక్కడక్కడ కలదు. ఇప్పటికిని దాటియాకు కలదు. ఇప్పటికిని ఉకారమును శకటరేఫము(ఱ)వలె వ్రాయువారు కలరు. కావున రాజరాజునాఁ డదివఱ కున్నకత్తంతయును మాఱిపోయి క్రొత్తకత్తు దేశమునం దంతటను బుట్టిన దనుట యుచితము కాదు. రాజరాజునాఁడు క్రొత్తకత్తు పుట్టినది సత్యమే కాని, యెప్పుడు పుట్టినది? సరిగా నాతఁడు సింహాసన మెక్కిననాఁడే పుట్టినదా? అట్లు చెప్పవలనుపడదు. ఇఁక నెప్పుడు పుట్టినది? ఎప్పుడో యొకప్పుడు రాజరాజుకాలములోఁ బుట్టినది. అది పుట్టుటకుఁ బూర్వము రాజరాజుకాలమునఁగూడఁ బ్రాఁతలిపియే యుండెడిదికదా. ఆ కాలమున నీయుద్ధమల్లశాసనము పుట్టియుండరాదా? ఇంతయేల రాజరాజు కాలమున రెండులిపులునుగూడ నున్నట్లు రాజరాజు వ్రాయించిననందంపూడి శాసనమే ఋజువుచేయుచున్నది. ఇది రాజరాజుపరిపాలనములో ౩౨-వ యేఁటఁ బుట్టినది. అందు రెండులిపులునుగూడఁ గలవు. ఈవిషయమై శ్రీరామయ్యపంతులుగారే యిట్లు వ్రాసిరి.

శ్రీః

# కాటయవేముఁడు.

ఆంధ్రదేశమున ప్రఖ్యాపించినమహావీరులలోను, మహారాజులలోను, పండితులలోను, వ్యాఖ్యాతలలోను, రసజ్ఞులలోను కాటయవేముఁడు ప్రసిద్ధికెక్కెను. ఈతనివ్యాఖ్యానరత్నము కాళిదాసాకరోద్భూతశాకుంతలనాటకరత్నమునకు మెఱుఁగువెట్టి యపారప్రభాభంగముగఁ బ్రకాశింపఁజేసెను. "మోనియర్ విల్లియం" పండితుఁడు ౧౮౫౩ సం॥రముననే ఇండియాఆఫీసు లైబ్రరీలో "మెకంజీ"సంపాదిత మగుకాటయవేమవ్యాఖ్యం జూచి తనశాకుంతలప్రతిని సవరించుకొనినటులు వ్రాసియున్నాఁడు. తాను జూచినప్రతి బొంబాయిరాష్ట్రమున సంపాదింపఁబడి నాగరలిపిలో వ్రాయఁబడెనఁట. మోనియర్ విల్లియము గారి యింగ్లీషువ్యాఖ్యానము, కాటయవేమవ్యాఖ్య శంకరవ్యాఖ్యల ననుసరించి వ్రాయఁబడెనఁట. కాటయవేమవ్యాఖ్య ననుసరించియే జర్మనీదేశవిఖ్యాతపండితుఁడగు "గెయిటే" శాకుంతలముం జదివి తాండవ మాడె నను "నైతిహ్య"ము కలదు. ౧౮ శతాబ్దమధ్యమున పరాసువారీ దేశమునుండి గ్రహించిన యనర్ఘవస్తువులలోఁ గాటయవేమవ్యాఖ్య యొకటి. అది మతబోధకుల మూలమున "పారిసు"పట్టణమునందలి "బిబ్లియాథిక్ నేషనల్" లైబ్రరీలో నుంపఁబడెనఁట. పైకారణములవలన "కాటయవేము"నిపాండిత్యము పాశ్చాత్యపండితులకుఁగూడ నానందదాయక మైనది. "మాళవికాగ్నిమిత్ర" వ్యాఖ్యను గొంత, శాకుంతలవ్యాఖ్యను గొంతయుఁ జదివిచూడఁగా, మూలమును సరిగా నర్థముం జేసికొనుట కెంతయు నుపయోగించునదియై యున్నది. తెనుఁగులిపి యం దిపుడు ముద్రితమై యున్న శాకుంతలవ్యాఖ్య లగు "నిశ్శంకభూపాల" వ్యాఖ్యవలె క్లిష్టము గాక "శ్రీనివాసాచార్య" వ్యాఖ్యవలె విసుగును బుట్టించు సంగతులు లేక యింపుగ నుండును. ఇదివఱకు "కవులచరిత్ర"లోను, "ఆంధ్రులచరిత్ర"లోను లేని కాటయవేమునిచరిత్రము నాకడనుండిన "శాకుంతలవ్యాఖ్య"లోఁ గాన్పించుచున్నది. దాని నిక్రింద వ్రాయుచున్నాఁడను.

శ్లో॥ పాదారవిందాత్పరమస్యపుంసో యస్మాచ్చతుర్థోఽజనివిశ్వవంద్యాత్
పునాతినిత్యం భువనానిసింధుః పుణ్యైఃప్రవాహైస్సహజా యదీయా॥౧

వంశేస్మిన్ ముదితో మహీయసి మనోర్వంశే జగత్పావనే
ధీరోదాత్తగుణోత్తరో రఘురివ శ్రీకాటయాఖ్యో నృపః
దానత్రాత్రపరేణ యేన విదధే భూదేవసంతర్పణం
భూయిష్ఠైః పరిపంథిపార్థివజయవ్యాజేన లబ్ధైర్ధనైః॥ ౩
తస్మాదభూదఖిలకర్మవిధౌ వరేణ్యో మారక్షమాధిపతి రప్రతిమప్రభావః।
అన్యానపాస్య నృపతీనభిరూపముచ్చైర్వవ్రే స్వయంయమజమిందుమతీవకీర్తిః॥
తస్యాస్తాం తనయా సమగ్రవినయా విఖ్యాతదోర్విక్రమా
కాటక్షోణిపతిశ్చ రామనృపతిః కాంతౌనితాంతౌజసా
లక్ష్మీకీర్తివసుంధరాభి రభజత్సౌభాగ్యమాద్యస్తయోః
కౌసల్యాదివధూజనై ర్దశరథ శ్శోభాం ప్రపేదే యథా॥ ౪
అసహాయశూరకాటయప్రభుం వదంతి మారనృపతేస్తనూభవమ్।
భువనానిదుర్గజయసాహసేన యో జలదుర్గమల్లబిరుదః ప్రశస్యతే॥ ౫
పృథ్వీం బ్రాహ్మణసాచ్చకార విదధే హేమాద్రిదానాని య
స్సోపానావళి మాతతాన విషమే పాతాళగంగాపథే
దొడ్డాంబా ముపయమ్యతస్య తనయాం వేమప్రభోః కాటయః
పుత్రం వీర మలబ్ధ రామసదృశం వేమం విభూత్యై భువః॥ ౬
గుణానాం పుణ్యానాం వసతి రనపోతక్షితిపతే
స్స్వసా శ్రీదొడ్డాంబా సమభవదుమాయాః ప్రతినిధిః
పితా భూభృన్నాథః పతిరపి మహేశః ప్రియసుతో
మహాసేనో యస్యా స్స్వయ మథయదార్యేతి కథితా॥ ౭
మారక్ష్మారమణః పితామహతయా మాతామహత్వేనచ
శ్రీవేమక్షితినాయకః ప్రథయతే యస్యాభిజాతశ్రియమ్
ధన్యః కాటయవేమభూపతి రసౌ యద్భాగధేయ స్తతో
జామాతా స్వయ మన్నపోతనృపతేః క్షోణీశచూడామణిః॥ ౮
శ్రీకృష్ణేనసమః కుమారగిరిభూపాలో నృపాలోత్తమః
స్వామీ యస్య వసంతరాయబిరుదో వీరాన్నపోతాత్మజః
సంగ్రామార్జున మామనంతి సుధియ స్తం భీమసేనాన్వితమ్
భూమా కాటయవేమభూధవమహో కర్ణప్రియా స్తద్గుణాః॥ ౯
పల్వలపంచక మకరో త్ప్రధనే నిర్జిత్య వైరిణో రామః
వైరికులపరశురామః కాటయవేమస్తు వార్ధిశతమ్॥ ౧౦

ఘాటీఘోటీఖురాగ్రత్రుటితగిరితటే యత్ర మార్లేతిదుర్గం
దుర్గం కింమూరసంజ్ఞం దళితరిపుబలే దుర్గమం బెండపూడిం
దుర్భేద్యం వజ్రకూటం జితవతి రభసా రామగిర్యాఖ్యదుర్గం
విఖ్యాతాం వీరఘోటాం గళితసుసుహృదాం వీరసన్నాహదార్ఢ్యమ్॥ ౧౧
మునీనాం భరతాదీనాం భోజాదీనాం చ భూభుజామ్
శాస్త్రాణి సమ్యగాలోచ్య నాట్యవేదార్థవేదినామ్॥ ౧౨
ప్రోక్తం వసంతరాజేన కుమారగిరిభూభుజా
నామ్నా వసంతరాజీయం నాట్యశాస్త్రం యదుత్తమమ్॥ ౧౩
తత్రోక్తేనైవమార్గేణ దర్శితాశేషలక్షణః
కవీనా మాశ్రయో మంత్రీ కాటభూపతనూభవః॥ ౧౪
సోఽయం వేమవిభుః కుమారగిరిణా రాజ్ఞానియుక్తః కృతీ
నాట్యానాం త్రితయం కృతం కృతధియా శ్రీకాళిదాసేనయత్
తస్యోద్దీర్ణరసార్ణవస్య రసికశ్శ్రీకుంతలాదేస్స్వయం
వ్యాఖ్యానం కురుతే కుమారగిరిరాజీయాఖ్య మస్మై హితమ్॥ ౧౫

తాత్పర్యసంగ్రహము—పరమపురుషుని పాదారవిందమునుండి చతుర్థకులముద్భవించెను. ఈకులమునందు మనువంశమున రఘువువలె బ్రాహ్మణభక్తిపరుఁడగు కాటయప్రభువు జన్మించెను. వానివలన మారభూపతి జన్మించెను. కీర్తి పీసిని, యిందుమతి యజుని వరించినటులు వరించెను. మారభూపతికి విఖ్యాతపరాక్రమవంతులగు కాటభూపతి, రామనృపతి కలిగిరి. వారిలో మొదటివాఁడగు కాటభూపతి, దశరథుఁడు కౌసల్యాదులచే సేవింపఁబడినటులు లక్ష్మి, కీర్తి, వసుంధరాదులచే సేవింపఁబడెను. కాటవిభుఁడు దుర్గజయములలో సాహసవంతుఁడగుటచే బుద్ధిమంతులు "జలదుర్గమల్లుఁ"డందురు. హేమాద్రిదానముచేసి "పాతాళగంగ"కు సోపానము గట్టించిన ప్రసిద్ధికెక్కిన "వేమ"భూపాలునిపుత్రిక యగు "దొడ్డాంబిక"నుఁ బెండ్లియాడి "కాటవిభుఁడు" రామునితో సమానుఁడగు "కాటయవేము"నిఁ గనెను. దొడ్డాంబిక "యనపోత"విభుని చెల్లెలు. ఈమె "భూభృన్నాథు"ని కూఁతురై, మహేశు భార్యయై, మహాసేనుని తల్లియగు "పార్వతి"తో సమానురాలు. "మార"భూపతి తాత యగుటచేతను, "వేమభూపాలుఁ"డు మాతామహుఁ డగుటచేతను, కాటభూపతి తండ్రి యగుటచేతను, అనపోతవిభుఁడు మేనమామ యగుటచేతను గాటయవేముఁడు ప్రసిద్ధినొందినవాఁడాయెను. శ్రీకృష్ణునితో సమానుఁ

డగు "వసంతరాయ" వరనామధేయుఁడు, అనవోతాత్మజుఁ డగు "కుమారగిరి" భూపాలుఁడు కాటయవేమునికిఁ బ్రభువు. ఘనసేనసహితుఁ డగుసజ్జనునిగా సేనాసమేతుఁడగు నీతనిని యుద్ధములందు వర్ణింతురు. అతనిగుణములు 'కర్ణ' ప్రియములు. పరశురాముఁడు శత్రునృపులను జయించి రైమదుబురదగుంటలను (పంచహ్రదములను) జేసెను. సైనికులపరశురాముఁ డగునీకాటయవేముఁడు నూఱుసముద్రములఁ జేసెను. జైత్రయాత్ర చేఁ గాటయవేముఁడు "మాల్లె"తి దుర్గమును "కిమ్మూరు" దుర్గమును "బెండపూడి" దుర్గమును "వజ్రకూట" దుర్గమును "రామగిరి" దుర్గమును "సీరస్కోట" దుర్గమును జయించుటచే శత్రునృపుల బల ముడిగెను. "కుమారగిరి" భూపాలుఁడు భరతాదిఋషిప్రోక్తశాస్త్రములను, భోజరాజాదులమతమును, బరిశీలించి "వసంతరాజీయ" మనునాట్యశాస్త్రముం జేసెను. ఆకుమారగిరిభూపాలునిచే నాజ్ఞాపింపఁబడినవాఁడై కాటయవేముఁడు "వసంతరాజీయ" మనునాట్యశాస్త్రానుసారముగా శ్రీకాళిదాసకృత శాకుంతలాదినాటకత్రయమునకు వ్యాఖ్యానముం జేయుచున్నాఁడు. ఈ వ్యాఖ్యానమునకుఁ గుమారగిరిరాజీయ మనిపేరు.

శాకుంతల పీఠికలోని శ్లోకములవలన నేఁటికి గైకొనఁబడిన కాటయవేముని శాసనములలో లేనివిశేషములు కొన్ని తెలియనగుచున్నవి. 1. వంశవర్ణనములోఁ నేఁటివఱకుఁ గానరాని మారభూపతికి రెండవకుమారుఁ డగు "రామ" భూపతి యొకఁడు కలఁడనుట. 2. కాటయవేముఁడు జయించినదుర్గముల పట్టిక. మారభూపతికి "రామ" నృపుఁడు కలిగెననుసంగతి యేశాసనములలోను లేకపోవుటచే నిది 'ప్రక్షిప్తమో' లేక అట్టిపేరుగలవాఁడు కలిగి స్వల్పకాలమున మృతినొందియుండెనో యని తలంపవలసియున్నది. ఈతఁడు జయించినదుర్గముల జాబితాను బరిశీలించినయెడల రాజమహేంద్రవరము మొదలు సింహాచలము (విశాఖపట్టణమండలములోనిది) వఱకుమాత్రమే కాన్పించుచున్నవి. "మాల్లెతి" దుర్గమునకు "మొల్లేర" ని ౧౭ శతాబ్దమధ్యమున వాడుటకుఁ బ్రారంభించిరని ఏనుఁగు పెద్దలక్ష్మణకవియొక్క తులామాహాత్మ్యములోని యీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

గీ. పీఠికాపురి కిమ్మూరు బిక్కవోలు, తునియుఁ గొత్తాము మొల్లేరు ఘనత నేలె
వత్సవయతిమ్మభూపాల వరునిసుతుఁడు, రాజమాత్రుండె రాయపరాజశౌరి.

కిమ్మూరుదుర్గమే పెద్దాపురపుకోటగా మాఱెనని తోఁచెడిని. "బెండపూడి" దుర్గము నేఁడును దనప్రాచీనౌన్నత్యమును శైథిల్యముతోఁ జూపుచు

న్నది. ఒకప్పుడు వజ్రపుగనులు కల దని వాడుకగల "వజ్రకూటము" కాటయ వేమునికాలమునకు దుర్భేద్యదుర్గము కలదై నేఁడు స్వల్పజనులు కాఁపురము చేయు గ్రామమైనను వజ్రములవంటి వాఁడిగల ముండ్లతో నొప్పు పెద్ద వంకాయలచేఁ బ్రసిద్ధి కెక్కుటమాత్రము ప్రశంసనీయము. "రామగిరి" "వీరఘట్టు"దుర్గములు విశాఖపట్టణమండలములో నున్నవి. ఇందువలన కాటయ వేమునిరాజ్యము ఇంచుమించు 'ఏలూరి'నుండి 'సింహాచలము'నకు వ్యాపించి ౧౬ వేల చదరపుమైళ్లవైశాల్యము కల దని తలంపవలసియున్నది. ఈతఁడు దానధర్మములను విశేషముగఁ జేసిన తామ్ర, శిలాశాసనములు కృష్ణా గోదావరీ విశాఖపట్టణమండలములలోఁ గాన్పించుచున్నవి. ఇదివఱకు బయటఁబడిన శాసనములు కాక, 1. పెద్దాపురముతాలూకాలోని "తాళ్లూరు"లోని సాతాని మఠములోని శిలాశాసనమును, 2. కాకినాడతాలూకా "వేళంగి"లోని తామ్ర శాసనమును ముఖ్యములు. మొదటిది "కొమరగిరిరెడ్డి"యొక్క ఆరోగ్యమునిః శాలివాహనశకము ౧౩౨౮ చిత్రభానుసంవత్సర పుష్యమాసములో వచ్చిన మకరసంక్రాంతికి వ్రాయఁబడిన దానశాసనము. రెండవది, శా. శ. ౧౩౩౨ వికృతిసంవత్సర మాఘశుద్ధ ౧౫ వైద్యునికి "కొమరగిరిపురిని" కట్టించియిచ్చిన తామ్రశాసనము. రెండవశాసనమునందు విశేషము లంతగా లేవు కాని "తాళ్లూరు"శాసనముమాత్రము క్రీ. శ. ౧౪౦౭ ప్రారంభమువఱకు "కొమరగిరి" రెడ్డి జీవించియుండె ననియు రోగయుక్తుఁడై యుండెననియు సందేహమును గలిగించుచున్నది. శాసనముయొక్క యచ్చునుదీయుట వాంఛనీయము. రెండవశాసనమువలన, కాటయవేమునికి "కొమరగిరి"రెడ్డిపై నెంతటిగాఢ ప్రేమకలదో కొమరగిరి చనిపోయిన పెక్కేండ్లతరువాతనుగూడ నతనిపేరుతోఁ బట్టణమునుగట్టి యిచ్చుటచే వ్యక్త మగుచున్నది. మఱియు దాక్షారామము లోని భీమేశ్వరస్వామివారి యాలయమున నవగ్రహమండలమునకు దక్షిణమునఁ గలశిలాస్తంభమునఁ గలయీక్రిందిశాసనము "కాటయవేముని"యొక్క వృత్తాంతమును గొంత చెప్పుచున్నది.

"శ్లో. నప్తా కాటయశౌరేః పౌత్రో మారస్య కాటనృపసూనుః
వీరాన్నపోతనృపతే ర్జామాతా జయతు వేమభూపాలః.

యిటువంటి కాటమరెడ్డి వేమారెడ్డింగార్కి నిజభృత్యుండైన కడియము మాచినేనింగారు తనకు స్వామి అయినకాటమరెడ్డివేమారెడ్డింగారికిన్ని వారి దేవులకున్ను కాటమరెడ్డివేమారెడ్డింగారికుమారుండు కొమరగిరిరెడ్డింగారికిన్ని

వారిదేవులకుంను అక్షయసుకృత మవుసట్టుగాను దాక్షారామ శ్రీభీమేశ్వర శ్రీమర్క మహాదేవరకు అస్థానవేలామండపము కట్టించి శకవర్షంబులు ౧౩౩౬ అగునేంటి జయసంవత్సర కార్తిక శు ౧౫ భా. నాండు సమర్పించెను. పెద్దనాచార్యలిఖితం. శ్రీ శ్రీ శ్రీ.

ఈశిలాశాసనము "అనితల్లికలువచేరు" శాసనమునకు పూర్వము ౯ సం॥ రములనాఁడు వ్రాయఁబడెను. నాఁటికి కాటయవేమునకు "కొమరగిరి" యను కుమారుని పేరే ప్రసిద్ధిగ నున్నదికాని కాటప్రభువుపేరు కాన్పింపదు. కాటయవేమునకు "కాటప్రభు" వనుకుమారుఁ డుండెననియు నాతఁడు హరిహరరాయులకుమార్తెం బెండ్లియాడె ననియు "అల్లాడవేమారెడ్డి" "కోరుమిల్లిశాసనమునఁ గలదుకదా? అనితల్లి, దాక్షారామశాసనములలో కొమరగిరిరెడ్డిపేరు మాత్రమే యుండుటచేతను "కాటప్రభు"వే అనితల్లిసోదరుఁ డగుకొమరగిరిరెడ్డి యని యేల యూహింపరాదు? కొమరగిరిరెడ్డికిభార్యలుకూడఁ గల రని దాక్షారామశాసనము చెప్పుచుండుటచే "హరిహరాంబ"కూడ వారిలోనిదేమో యని సందేహము కలుగుచున్నది. మఱియు దాక్షారామశాసనములోని "అక్షయసుకృత"శబ్దము కాటయవేముఁడును, అతనికొమరుఁడగు కొమరగిరిరెడ్డియును దాక్షారామశాసనకాలమునకుఁ గలరా? గతించిరా యని సందేహజనక మగుచున్నది. "కడియము మాచినేని" మఱియొకశాసనము "చామర్లకోటభీమవర"ములోని భీమేశ్వరాలయములోని మండపస్తంభమునఁ గలదు. ఆశాసనము దాక్షారామశాసనమునకు మాఱురూపమేకాని విశేషము కాదు. పండితరా జగుకాటయవేమునిచరిత్రము ప్రాచ్యపాశ్చాత్యదేశములలో శిలాతామ్రశాసనగ్రంథరూపమున వ్యాపించియున్నదనుట యాంధ్రులవిఖ్యాతివిశేషముకదా?

పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి.

---

# పరిషత్పుస్తకభాండాగారము.

## మహేంద్రఖండము—గ్రం. సం. ౩౭౬.

ఈగ్రంథ మొకపద్యకావ్యము. ౧౮ పత్రములుమాత్రమే యున్నది. ఉన్నదియైనను చేసునకుఁ దగినట్లే ఖండఖండములై కొన్నిపత్రములతుదలు తెలియవచ్చుట లేదు. కొన్నిమొదళ్లు తెలియరావు. ఆశ్వాసాంతము కానందున గద్యము, కవిపేరు మొదలైనవి తెలియవచ్చుట లేదు. ఆశ్వాసారంభ మున్నను గ్రంథారంభము కాదని యీక్రిందివాక్యములు తెలుపుచున్నవి.

క. శ్రీముళువాగలుపార్థివ, కామితసంధాననిపుణకరుణాపాంగా
కామమదభంగ మస్తక, సీమాధృతగాంగభంగ, శ్రీశివలింగా.

వ. అవధరింపుము శ్రీమత్సంభవాసురఖండానంతరమహేంద్రఖండకథాక్ర
మంబు శౌనకాదిమహామునులకు సూతుం డిట్లు చెప్పందొడంగె.

క. ఆసురగురుండు పల్కిన, యాసురవృత్తాంత మెల్ల నాలించి భవా
నీసూనుఁ డతని కనియెను, నాసీనుఁడ వగు మటంచు నాదర మెసఁగన్.

ఈముళువాగలుపార్థివుం డెక్కడివాఁడో కవి యెవ్వరో దీనింబట్టి తెలియరాలేదు. ఇక్కవి యిదివఱకు సంభవఖండము, ఆసురఖండమును ముగించి మూఁడవది యగుమహేంద్రఖండమును బ్రారంభించిన ట్లూహింపవచ్చును.

స్కాందాంతర్గత మైనసంభవకాండమును వంకాయలపాటి వీరభద్రకవి రచియించి యున్నట్లు పరిషత్పుస్తకభాండాగారము గ్రం. సం. ౧౨౪౪ వలనఁ బొరకు లెఱిఁగియున్నారు. అదియు నిదియు వేఱుగాఁ దోఁచును.

ఈదులపల్లి భవానీశుఁ డనుకవి స్కాందాంతర్గతధర్మఖండమును రచియించి యుండెను. అది పరిషత్పుస్తకభాండాగారమున గ్రం. సం. ౧౧౭-౧౧౮ గా రెండు గలవు. అందు స్పష్టముగా,

గీ. స్కాందమునఁ దగు నేఁబదిఖండములను, ధరణిధరములఁ గనకభూధరముకరణి
మేటియై ధర్మఖండంబు మిగుల నమరు, నదియు నా నేర్పురీతిఁ జెప్పెదము దమున.

స్రగ్ధర. చంచన్నిర్వాణలక్ష్మీసమధికఫలదస్కాందకళ్యాణవాణీ
పంచాశత్ఖండహారప్రవిమలతరళోద్భాసి యై ధర్మకర్మ

ప్రాంచల్లీలాస్పదం బై హరమురహరిమాహాత్మ్యశోభాంచితం బై
యంచచ్ఛ్రీధర్మఖండం బది దురితతమోహేళి యై హేళి నొప్పున్.

అని, పదిదినంబులు భీష్ముఁ డాహవభారకుం డనుతరలమును, పదిదినము లైదు ప్రొద్దు లనుగంపపద్యమును మది నుంచికొని వ్రాసియున్న ట్లందున ధర్మఖండ మొక్కటియే రచించినట్లు తెల్పుచున్నాఁడు. ఈకృతిం గైకొనఁ గోరిన యీశ్వరుఁడు కూడ:

గీ. సర్వధర్మకర్మసారసంగ్రహశోభి, యైనధర్మఖండ మాంధ్రభాష
నీవు రచనసేయు నీకథ మాపేర, నంకితంబుసేయు మనఘచరిత.

అనికూడఁ గోరియున్నాఁడు. ఈధర్మఖండము తొమ్మిదియాశ్వాసములుమాత్రము పరిషత్తునకు లభించెను.

మధురాఖండము మల్లంపల్లిబుచ్చయలింగముకవి రచియించినది. గ్రం. సం. ౧౧౨౯ గలదియుఁ బరిషత్పాఠకు లెఱుఁగుదురు. కాన నీమహేంద్రఖండముకవిం దెలిసికొన యత్నింపవలయును. ఈతఁడును ధర్మఖండగ్రంథకర్తవలెనే శ్రీశైలమల్లేశలింగమునే స్తుతించియుండుట యొకటి. శ్రీముఖివాగలు పార్థివుఁడు తనకును శ్రీమల్లేశ్వరునకు నడుమ మధ్యవర్తిం దెచ్చిపెట్టెను. ఇందలి కథ కుమారస్వామి శూరపద్మాదిదైత్యుల వధించి యింద్రునకు దేవతలకు మేలు చేయుట యని

గీ. వినుఁడుహరిపురందరముఖ్యవిబుధులార, భ్రాతృసహితంబుగా శూరపద్మునతని
బంధుజనములనందఱఁ భంజనమున, గూల్చిమీమనోరథములఁ గూర్తునెలమి

అను పద్యముచేఁ దెల్లము. తారకాసురసంహారాదులును వచ్చును. దీనిని శ్రీమాన్ దూపాటి తిరుమలశేషాచార్యులుగారు సంపాదించిరి. చొప్పకట్ల రామజోగిగారు వ్రాసికొన్నది.

శైలికై మహేంద్రఖండములోని కొన్నిపద్యములు:—

మ. మఱియున్ ఖండితబాహుతుండత నిలింపద్వేషి యుద్వృత్తి నే
త్తెఱ నేతెంచినఁ గాంచి బాహుబల ముద్దీపింప యుద్ధోర్విఁ గ్ర
మ్మఱ వీరాగ్రణి వీరబాహుఁ డురుశుంభత్ప్రౌఢిఁ బాదాహతిం
దొఱఁగం దన్నిన వాఁడు గూలె ధరణిన్ దుర్నిర్గతప్రాణుఁడై.

ఉ. ఎవ్వఁడొకో యితండు భయ మించుకలేక మనంబులోన బల్
క్రొవ్వున ద్వారరక్షకుల గొబ్బున మోసముచేసి వచ్చెఁ; లే

కం. హరితసగోత్రపవిత్రుఁడ, సరసీయుజశాఖయందు సంభవమైతిన్
ధర నాపస్తంబుఁడ నో, హరి నీకృపఁ బాకనాటి నలరినవాఁడన్.
గీ. అవధరింపుము సుకవికర్ణామృతంబు, నాఁగ రచియింతుఁ గవిజనకు సడుసఁదగిన
సూత్రములు విన్నకన్నంత సొరిదిఁ బెనఁచి, సుకవికర్ణకఠోరము మెఱుఁగు వెలయ.

అని ప్రతిజ్ఞచేసెను. ఇందు గురులఘుస్వరూపములు, మున్నుగ ప్రాస ప్రకరణము, యతిప్రకరణము, బండికాలు, వృత్తలక్షణమును గలవు. చివరఁ గొంతభాగము లేదు. ఇందుఁ బూర్వలాక్షణికులు భాగవతమునుండి లక్ష్యముల గ్రహింపమికి నిరసించుచు

సీ. పూర్వులు బమ్మెరపోతరాజుఁ దవిలి సీతాధిపుని రవ్వసేయుఁ దలఁచి
పటుబుద్ధిచే భాగవతములోపల లెస్స భావించి లక్ష్యముల్ వ్రాయరైరి
పోతరాజుకు విద్యపూర్ణమై యుండదో లేకున్న నతనిలో లేని నుండు
రామభద్రునకు సులక్షణజ్ఞత లేదో తలఁప నిందులకు సత్యదృష్టాంతంబు
పూర్వకవిబృందము బుద్ధిపుష్పమేసె, సనుమఁజంబించినట్లు ప్రాసచటసచట
భాగవతలక్ష్యములు వ్రాయఁబ్రజ్ఞవాడమో, చలదళాకాంతిశోభనాచలవిహార.

అని కొన్నిభాగవతప్రయోగములం జూపెను.

లింగముగుంట తిమ్మన బాలబోధఛందమునుండి—

సీ. శ్రీవైష్ణవహితుండఁ జిక్కయభట్టరుశిష్యుఁడఁ గవితావిశేషశేష
తులితసర్వార్యపౌత్రుఁడ . . . మ్మాంబకు సుతుఁడఁ బేరసకు మాచనకు

అన్నాఁడు. అని కొంచెము వ్రాసెను. లింగముగుంట తిమ్మన బాలబోధమను ఛందమును రచించినట్లు తెలియవచ్చుచున్నది.

సూరపరాజు పరమయోగివిలాసము—

“నిగమచోరకుని ఖండించినయలఁతయో యబ్ధిలో గిరి మోసినట్టియలఁతో”
అను సీసచరణ మొక్కటి చూపినాఁడు.

ఇంతకంటె నూతనగ్రంథము లిందుఁ గన్పట్టనలేదు. శ్రీరంగమాహాత్మ్యము, భాస్కరరామాయణము, మనుచరిత్రము, నైషధము, కాశీఖండము, పిల్లలమఱ్ఱిపినవీరన శాకుంతలము, సోమునిహరివంశము మొదలగువాని వాడుక పద్యములే కొన్ని కలవు.

అపురముపద్యములు—గ్రం. సం. ౪౦౧౧.

ఇది శ్రీమద్వేదమార్గప్రతిష్ఠాపనాచార్యోభయవేదాంతప్రవర్తకులైన శాంతిశమదమాద్యనంతకల్యాణగుణగణపరిపూర్ణులైనయస్మదసాధారణస్వాము లైవేంచేసియుండే తరిమెల శేషాచార్యులవారికి మాధవుఁడు కుమారుండయి

కృష్ణనగానామాత్యులవారు చెప్పిన అనునామపద్యములు. పద్యములందు "మేడికుంట [illegible] కృష్ణ" యనియుండుటచే మేడికుంట యీకవినివాసము కావచ్చును. ఇందు ప్రథమద్వితీయకాండములు గలవు. ద్వితీయకాండసింహాదివర్గలోఁ గొంతవఱకున్నది. ఇం దమరములోనిపదములు సంఖ్యలోఁ జెప్పి విశేషపదములం గూడఁ జేర్చి వ్రాయుచున్నాఁడు. మొదటిపత్త్రము లేదు. ఉదాహరణమునకుఁ గొన్నిపద్యములు.

సీ. సవ్యవిష్టాదులు సలుసదిమూఁడును సవరిష్టనేమిశ్రీజానికోల
కంత గదాధరుల్ ఘనశార్ఙ్గధన్వుఁడు గిరిధరశ్రీధరుల్ ధరణిధవుఁడు
పదుమకుందుఁడు యజ్ఞపురుషుండు బ్రహ్మణ్యాఖ్యలో చనరికాంతకులును
సరి జగన్నాథుఁడు మురరిపుశ్రీకరుల్ శ్రీవక్రచక్రజుల్ చెలఁగ సంత
శయనుఁయదునాయకస్వభూశంభు లనఁగఁ
నొనరు భూతాత్మ యన నాత్మయోని యనఁగఁ
లలిన్నృపాకపివిశ్వరూపులును హరియుఁ
బభ్రు ననఁగను నీపేళ్లు పద్మనాభ.

గీ. సాంత మగువిష్ణుశ్శ్రవశ్శబ్ద మొగిని, డెబ్బదియు నాల్గు విష్ణుపేళ్ల్ తీవిఁ జెల్లు
వెలయ వసుదేవయుగ్మము విష్ణుశంత్రి, కదియెఁ బేళ్లిట్లు కృష్ణపద్మాక్ష . . .

ను. ఫణపుచ్ఛంబులు గల్గి మానవులభవ్యాకారయుక్తంబులై
గణనన్ దైవతయోనులై చెలువల్ గా కాద్రవేయంబు లీ
ఫణితిన్నాగము లంచుఁ బేరు లగు నీపాతాళవర్గంబు నెం
చను గృష్ణార్యకృతంబునై పొసఁగుఁ గృష్ణా మేడికుంటాధిపా.

సీ. పృథ్వీసంబంధమౌ రెండవకాండలోఁ బొసఁగు సాంగోపాంగములగుమృత్తి
కాద్యంగములతోడ ఘనధాన్యాదిప్రత్యంగములను యుక్తంబైనభూపురాఖ్య
శైలవనౌషధీసింహములచేత ఘనమనుష్యబ్రహ్మక్షత్రవైశ్య
శూద్రజంబుచేఁ జూడఁగా నైనయీవర్గలు పల్కఁగఁబడిన వయ్యె [త
ముప్పదియు నాల్గు భూశబ్దముఖ్యములును, జగతియుఁ గాంతగర్భయు నాటిభూ
[illegible] దసరు నింక, నామములు కొన్ని వివరింతు నలిననేత్ర.

ఈపుస్తక మిదివఱకుఁ జక్కఁగా నమరముం జదువుకొన్నవారికే యుపయోగము. వ్రాతవా రమరము దగ్గఱఁ బెట్టుకొని యందున్నపదములు చెప్పినసంఖ్యఁ దెలిసికొని మిగిలిన విందుండి గ్రహించుచుండవలయును.

శ్రీరస్తు.

# శ్రీపరవస్తు చిన్నయ్యసూరిగారి జీవితచరిత్రము.

---

ఆంధ్రదేశమునం దక్షరాస్యు లగువారిలో బాలవ్యాకరణమును నీతిచంద్రికను జదువనివా రుండుట యరుదు. ఆపుస్తకములను రచించిన పరవస్తు చిన్నయ్యసూరిగారిజీవితచరిత్రవిషయమునఁ బలువురు వివాదపడుచుండుటచే వాస్తవము వెల్లడించుట యుచిత మని యిటఁ గొంత ప్రస్తావించుచున్నారము.

చిన్నయ్యసూరిగారిజన్మస్థానము చెంగల్పట్టుజిల్లాలోని శ్రీపెరుంబూదూరు. శ్రీరామానుజులవారిజన్మస్థాన మిదియే. సూరిగారు చాత్తాదవైష్ణవులు. (అనగా సాతానివారు). వీరితండ్రిగారు పరవస్తు వేంకటరంగయ్యగారు సంస్కృతాంధ్రద్రావిడభాషలందు విశేషపాండిత్యము గలిగినవారు, ధర్మశాస్త్రమునందు విశేషానుభవము గలిగియుండిరి. వీరు, "ఈస్టిండియా కంపెనీ" వారిపరిపాలనకాలమందుఁ జెన్నపురిలోని యున్నతన్యాయస్థానము (Supreme High Court) న నుండినపండితసభలో నొకసభ్యుఁడుగా నుండెడివారు. వీరే చిన్నయ్యసూరిగారికి బాల్యమున విద్యాబుద్ధులు గఱపినవారు.

చిన్నయ్యసూరిగారును దండ్రికి మించినకొడుకై యాంధ్రభాషయం దధికపాండిత్యము నలవరించికొని స్వపాండిత్యమహిమ నితరులకుఁ జవిచూప గ్రంథములను రచింప నారంభించిరి. "వాణీదర్పణ" మను పేర నొక ముద్రాయంత్రమును నెలకొల్పి ౧౮౫౩ సంవత్సరమున నీతిచంద్రికను బ్రథమముద్రణ మొనరించిరి. బాలవ్యాకరణమును వారే రచించిరి. సూరిగారిపాండిత్యాతిశయమును దెలుపునొకచిన్నవృత్తాంత మిచటఁ బొందుపఱిచెదము:-

ఇప్పుడు రాజధానికళాశాల (Presidency College) యను పేరఁ బరఁగుచున్నయది యాకాలమున నున్నతపాఠశాల (High School) యను పేర నుండెడిది. అప్పటివిద్యార్థులకు Profficient degree యనునది యొకయుత్తమకక్ష్య. ఈపాఠములు చెప్పుట కాపాఠశాలలో నప్పు డిరువురు పండితులు (Head Master and Assistant Master) కావలసివచ్చిరి. ఆపదవులకు శ్రీపురాణము

హాయగ్రీవశాస్త్రిగారొకరును (వీరే మొట్టమొదట నాంధ్రమహాభాగవతముసు ముద్రించినవారు) శ్రీపరవస్తు చిన్నయ్యసూరిగా రొకరు సభ్యస్థలుగా నుండిరి. అప్పుడు విశ్వవిద్యాలయకార్యదర్శిగా నున్న ఆర్బత్నటుదొరగారు (Mr. A. J. Arbuthnot) గొప్పపండితుల నిరువుర రావించి వీరిద్దఱఁ బరీక్షింపించిరి. ఆపరీక్షవలన చిన్నయ్యసూరిగారికి మొదటిపండితపదవియు, హాయగ్రీవశాస్త్రిగారికిఁ దత్సహాయపదవియు లభించినవి. అంతకుఁబూర్వము చిన్నయ్యసూరిగారికి "చిన్నయ్య"యనిమాత్రము పేరుండెను. విశ్వవిద్యాలయకార్యదర్శులు సీమనుండి "చిన్నయ్యసూరి"యను పేరు చెక్కఁబడినబంగారుకడియమును తెప్పించి పారితోషికముగా నొసంగిరి. నాఁటనుండి "చిన్నయ్యసూరి"గా రనువ్యవహారము ప్రబలినది. విద్వత్తాదోన్నతిక మగుశాస్త్రిమున్నగుపదము వీరినామమునకుఁ జేరలేకుండుట బాగులేదని యుచితజ్ఞుఁ డగునార్బత్తునట్టుదొరగా రిట్లొనరించియుండిరి.

ఇది యిట్లుండఁ బ్రకృతమున నున్నతన్యాయస్థానమున న్యాయాధిపతులలో నొక రగు శ్రీ. గా. న్యాయమూర్తి కుమారస్వామిశాస్త్రిగారిపితామహులగురంగనాథశాస్త్రులవా రాకాలమున "స్మాలుకాజుకోర్టు"లో న్యాయాధిపతులుగ నుండిరి. వీరికి సంస్కృతభాషయందే కాకశాస్త్రములయందును, ౧౫ భాషలందును బాండిత్యముండెను. వీరు నివసించుగృహమున కసతిదూరముననే హాయగ్రీవశాస్త్రిగారినివాస మగుటంజేసి వీరికి రంగనాథశాస్త్రిగారితో నధికపరిచయమును, రంగనాథశాస్త్రిగారికి హాయగ్రీవశాస్త్రిగారియం దధికాభిమానమును సంభవించినవి. ఇట్టియనుబంధమువలన, శ్రీరంగనాథశాస్త్రిగారు హాయగ్రీవశాస్త్రిగారి నెట్టులయినఁ బ్రధానాధ్యాపకులుగా నియమింపవలయు నను తలంపుగొనియుండిరి. ఒకనాఁడు హాయగ్రీవశాస్త్రిగారితోఁ "ప్రభుత్వమునకు నివేదించి మీకుఁ బ్రధానోపాధ్యాయతను నిప్పింతు" మని చెప్పఁగా హాయగ్రీవశాస్త్రిగారు దానికి సమ్మతింపక తమకంటె నధికపాండిత్య గలసూరిగారే యాపదవికిఁ దగినవారని తెలిపి సూరిగారిపాండిత్యము ప్రకటించుటకై రంగనాథశాస్త్రిగారికోరికపై నొకయాదివారమునాఁడు సూరిగారిని వెంటనిడుకొని రంగనాథశాస్త్రిగారియింటి కేగిరి. మధ్యాహ్నము మూఁడుగంటలకాలమునకు సూరిగారు రంగనాథశాస్త్రిగారికోరికపై నలంకారశాస్త్రవిషయమున నొకయుపన్యాసము గావింప నారంభించిరి. ఆయుపన్యాసధోరణినిమగ్నులగురంగనాథశాస్త్రిగారి కెంతవేళ యైనదో తెలియదయ్యె. పనికత్తె దీపము

కలిగించినది. ఉపన్యాసము జరుగుచునే యున్నది. వినువారికి విసుగుపుట్టకుండుటయేకాదు తనివితీరలేదు. భోజనసమయమని సూపకారుని వేదనముం బెట్టి కాలాతిక్రమణమును రంగనాథశాస్త్రిగారు గుర్తించిరి. సభామధ్యమున సూరిగారియెడలఁ దమ కిదివఱ కున్న యభిప్రాయమును వదలుకొంటి మని సెలవిచ్చి నాఁటిసభను శ్రీరంగనాథశాస్త్రులవారు ముగించిరఁట. మఱియు నప్పుడప్పుడు హయగ్రీవశాస్త్రిగారితోపాటు సూరిగారినిగూడఁ దమయింటికి వచ్చుచుండుఁ డని కోరిరఁట.

చిన్నయ్యసూరిగారు తాము రచించిన నీతిచంద్రికను ౧౮౫౩ వత్సరమున స్వయముగఁ బ్రథమముద్రణము గావించిరి. పిదప సకారాద్యాంధ్రనిఘంటువు నొకదానిని ముత్యములంబోలు తమచేతివ్రాఁతతో వ్రాయుట కారంభించిరి. రెండుసంపుటములు నింపిరి కాని యది యింకను విశేషభాగము మిగిలియే యుండఁగానే సూరిగారు ౧౮౬౧ వత్సరాంతమున వీఁపున రాచపుండుపుట్టి ౧౮౬౨ సంవత్సరారంభమున (దుందుభిసంవత్సరమున) నేఁబది మొదవయేటఁ బరమపదము నొందిరి.

చిన్నయ్యసూరిగారికి మువ్వురు పుత్రులు జనించిరి కాని వా రెవ్వరికిని మగసంతతి లేకయే కాలధర్మము నొందిరి. రెండవకుమారునికి శ్రీ శేషము రామానుజసూరిగారికొమరిత నిచ్చి వివాహ మొనరించిరి. ఆమె కొకకూఁతురు పుట్టినది. ఆమె కొక మగచిన్నవాఁడు పదునాలుగేండ్లప్రాయమువాఁడు వర్ధమానుఁడై యున్నవాఁడు. ఈచిన్నవానితండ్రి రివిన్యూయిన్‌స్పెక్టరుగా నుండి చనిపోయెను.

సూరిగారు చనిపోవనున్నపుడు తమరెండవకుమారుని మామగారగు రామానుజసూరిగారిని బిల్చి తాము ప్రారంభించిన నిఘంటువును బూరింపఁ గోరిరి. వీరు దక్షులే కాని వీరి కీగ్రంథమును జూచుటకైన నవకాశము లభింపకుండుట భాషాలలన దురదృష్టము. రామానుజసూరిగారు ఆకాలమందు నార్మల్ పాఠశాలయం దాంధ్రప్రధానోపాధ్యాయులుగా నుండెడివారు. వీరి కాంగ్లభాషాపాండిత్యము కల్గుటచే మదరాసు రాజధానికి వచ్చు (Junior Civilians) ఇంగ్లీషుదొరలకు దేశభాష నేర్పుటకై ప్రభుత్వమువారిచే నియమితులై యుండిరి. చిన్నయ్యసూరిగారు గతించినపిదప వారియుద్యోగమునే వీరి కిచ్చిరి. పాఠశాల, దొరలకుఁ జదువుచెప్పుట యీ రెంటిచే దినమంతయుఁ దీరిక లేకపోయినది. ఈయన ౧౮౭౦ సంవత్సరము అక్టోబరు ది ౨౮ తేదిని చని

పోయిరి. ఆసమయములోఁ దమ పెద్దకొమారుఁడును, కాకినాడలో సబుజడ్జి పని చేసినవారు నగు శ్రీ వేకము మనవాళ్లయ్యగారి నీపనికి నియోగించిరి. వీరుభయభాషాపాండిత్యము కలవారే కాని దానిని రాజకీయకార్యములయాటంకము చేఁ బూర్తి చేయలేదు.

చిన్నయ్యసూరిగారి *శిష్యులును శ్రీ వేకము రామానుజసూరిగారి పిమ్మట నార్మల్ స్కూలులో నాంధ్రపండితులును జగద్గీతకీర్తులు నగు శ్రీమాన్ బహుజనపల్లి సీతారామాచార్యులుగారు శబ్దరత్నాకర మను నొక చిన్ననిఘంటువును రచించి, వ్రాసిని, దేశభాషాగ్రంథప్రకటనసభవారికి ౫౦౦౦ రూపాయల కమ్మివేసిరి. ఆసభవా రధికధనబలము కలవారగుటం జేసి శబ్దరత్నాకర మచిరకాలముక్రిందటనే ప్రకటింపఁబడినది. ఇప్పుడు చిన్నయ్యసూరిగారి యసంపూర్ణనిఘంటువు శ్రీపిఠాపురముమహారాజాస్థానపుస్తకభాండాగారమున నున్నది. మనవాళ్లయ్యగారు స్నానసమయమున నదీప్రవాహములో మరణించిరట.

చిన్నయ్యసూరిగారి వంశపుత్రుని బాలసుబ్బఁడియు మనవాళ్లయ్యగారి తమ్ములును నగు శ్రీ వేకము భాష్యకారులయ్యగారిని చిన్నయ్యసూరిగారిచరిత్రము దెలుపుఁడని నే నడుగఁగా వారు మాటలాడ శక్తి లేనివారయ్యు చిన్నయ్యసూరిగారియెడ గౌరవమునను, నామాట నన్యథాకరింపలేకయు శ్రమపడి ది ౨౩ జనవరి ౧౯౨౦ సంవత్సరమున నెట్లో యొక వ్రాఁతమూలమును బ్రథమముద్రణ నీతిచంద్రికయు నిచ్చిరి. ఆవ్రాఁత యాధారముగా నే మీజీవితచరిత్రము బ్రకటించుచున్నారము. భాష్యకారులయ్యగారి వ్రాఁతమూలమును నీతిచంద్రికయుఁ బరిషత్పుస్తకస్థానమున భద్రపఱుపఁబడినవి. భాష్యకారులయ్యగారును మా కిది వ్రాసియిచ్చిన కొలఁదినాళ్లకే ౭౦ సంవత్సరముల వయస్సునఁ బరమపదించిరి. వీరియాత్మకు శ్రియఃపతి శాంతి ప్రసాదించుఁగాత!



* సీతారామాచార్యులవారు శబ్దరత్నాకరమున చిన్నయ్యసూరిగారిపాండిత్యమును నిఘంటువును బ్రస్తుతించిరి కాని తాము వారిశిష్యు లనిమాత్రము సూచింపరైరి. దీనికి హేతు వేమో.